# చందమామ

ఈ సంచికలో కథలు
వింతలు - విశేషాలు

★



ఇవి గాక :
ఫోటో శీర్షికల పోటీ, కార్టూను, మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.




ఇది నిక్కము...



...పగిలిన పాత్ర, నీటిని మంచి
పాత్ర ఉంచినట్లు నిలవుంచదు,
శిరోజ రంగుతో నలుపుచేయబడిన
శిరోజముల నలుపు లోమాతో
చేయబడినట్లుగా నిలవుండదు.

శిరోజరంగు శిరోజరములను
పైపైని మాత్రమే నలుపుచేయును,
లోమా శిరోజములను సహజంగా నలుపుచేయును.




జగత్ప్రసిద్ధమైన బెండ్రడు
కలను సహజంగా నలుపు
చేయునట్టిది.

షాల్ విఠల్లు. ఎమ్. ఎమ్. ఖంధరావాలా అహమదాబాద్ 1

ఏజంట్లు :

సి. నరోత్తమ్ అండ్ కో.,
బొంబాయి - 2.

★

ఢిల్లీ మెడికల్ స్టోర్సు, ఢిల్లీ.

★

షాహ బవిషి అండ్ కో.,
రాధాబజార్ స్ట్రీట్, కలకత్తా.

★

జె. బలాభాయ్ అండ్ కో.,
నేతాజీ సుభాష్ రోడ్, మద్రాసు.

TIC 53a



1936 వయస్సు 20 ఏళ్లే అయినా భార్య, ఉద్యోగం, హెర్క్యులిస్ సైకిల్ వుండడంచేత ఆ పట్టణంకెల్ల తమ అదృష్టవంతుడననే గర్వం గంగాధరానికి వుండేది. యువకునికి ఇంకా తక్కువేమిటి?

నేడు ప్రపంచం ఎంతగా మారిందో! అనేక ఏళ్ల గంగాధరాన్ని ఆఫీసుకు తీసికొని వెళ్లతూ వచ్చిన నమ్మకమైన పాత హెర్క్యులిస్ ఇప్పుడు 20 ఏళ్ల గల ఆయన కుమారుని కాలేజీకి ప్రతి రోజూ తీసికొని వెళ్లుతున్నది.

## హెర్క్యులిస్ నిజానికి సైకిల్ కంటె ఎక్కువైనది; అది జీవిత భాగస్వామి




హెర్క్యులిస్ యజమానిని అడగండి. అది జీవితాంతం వుంటుందని ఆయన చెబుతాడు. దాదాపు 50 సంవత్సరాలుగా మేలురకం సైకిళ్ల ఉత్పత్తిలో అనుభవం గడించినవారి సహాయంతో సునిశితమైన ఈ హెర్క్యులిస్ సైకిల్ ఇప్పుడు టి. ఐ. సైకిల్స్‌వారి అత్యాధునాతనమైన ఫ్యాక్టరీలో తయారు చేయబడుతున్నది. దాని అందం, మెత్తదనం, అతి తేలికగానే దానిని త్రొక్కడానికి వీలుండడం మీరు తప్పక మెచ్చుకుంటారు. మీరు కొనగలిగినవాటిలో హెర్క్యులిస్ బహుమేలైనది. అయినా దాని ధర సరసమైనదే.

మీ సైకిల్ మీకు పెట్టుబడి - **హెర్క్యులిస్** మీరు ఖర్చు చేసే డబ్బుకు పూర్తివిలువనిచ్చే

ఇండియాలో ఉత్పత్తిదారులు: టి. ఐ. సైకిల్స్ ఆఫ్ ఇండియా లిమిటెడ్, మద్రాసు

# అశోకా ఫ్లవర్ ఆఫ్ హెవెన్ టాల్కం

## పౌడరు అండ్ స్నో



గగన కుసుమమువంటి ఈ అపూర్వ సౌంద ర్యోపకరణములు, విజయ కెమికల్సువారి సుదీర్ఘ పరిశోధనా ఫలితముగా తమకు లభించుచున్నవి. నవీనమయిన కెమికల్సువల్ల, పరిమళ ద్రవ్య ములవల్ల అత్యుత్తముగా తయారైనవి. వీటి ఉపయోగమువల్ల మీ సౌందర్యమును, ముఖ వర్చస్సును, యినుమడింపచేయును. ఉపయో గించిన అతి శీఘ్రకాలములోనే వీటి గుణములు మీరు గమనించగలరు. నేడే ఉపయోగింపుడు.

**విజయా కెమికల్స్,**
**మద్రాసు - 7.**

ఏంజట్లు :—గుడ్ విల్ ఏజన్సీస్, బెజవాడ.

---

*Worth any price*

*"And yet priced low"*

**Nutrine**
**SWEETS**

ది న్యూట్రీన్ కన్ఫెక్షనెరి కంపెని
లిమిటెడ్, చిత్తూరు (ఆంధ్ర)

# తల్లులకు హెచ్చరిక!

## ప్రమాదకరమైనవ్యాధికిదించకముందే మీబిడ్డజలుబుబాధనివారించుకోండి!

ఈ మంచి ఘాటైన పూత మందును ముక్కు, గొంతు, గుండెల బాధల నివారణకు రాత్రిపూట రుద్దండి!

మీ బిడ్డకు జలుబు చేసినపుడు అశ్రద్ధ చేయవద్దు. మీ బిడ్డ గుండెల మీద, వీపుకు, గొంతుకు రాత్రిపూట నిద్రపోబోయే ముందు రుద్దండి. ఎక్కడైతే జలుబు బాధలు వుండగలవో అక్కడల్లా అతడికి కొంత ఉపశమనం కలుగుతుంది. రాత్రల్లా మీ బిడ్డ హాయిగా నిద్రపోతూ వుండగానే మీ బిడ్డ జలుబు బాధలను విక్స్ వేపోరబ్ నివారిస్తూనే వుంటుంది. ఉదయానికల్లా అతడు మామూలుగా అవుతాడు.

జలుబును 2 విధాల నివారిస్తుంది!



**1** ముక్కు ద్వారా పనిచేస్తుంది.

మీ బిడ్డ గాలిని పీల్చునపుడు విక్స్ వేపోరబ్ ఘాటైన వాసన శ్వాస నాళాలలోనికి పోయి ముక్కు, గొంతుల జలుబు బాధలను నివారిస్తుంది.



**2** చర్మం ద్వారా పనిచేస్తుంది.

విక్స్ వేపోరబ్ మీ బిడ్డ చర్మానికి వెచ్చదనం చేకూర్చి, ఉపశమనం కలిగించి, తద్వారా గుండెల లోని జలుబు బాధలను నివారిస్తుంది.

గుండె, గొంతు, వీపులపై రుద్దండి!




విక్స్ వేపోరబ్

328 TE:

విక్స్ వేపోరబ్ ఇప్పుడే వాడి చూడండి!

కొత్తది, చేతిలో ఇముడు నమూనా సైజు డబ్బా ధర 40 న.పై. మాత్రమే

పన్నులు అదనం





















HVM. 313A-19 TL
















డాల్డా వనస్పతి
పిల్లలకున్ను అందరికిన్ని
బలంగలిగిస్తుంది.
శరీరము నుమంచి
ఆరోగ్యముగానుంచునట్టి
ఎ.డి. విటమిన్‌లు,
దానిలో చేర్చబడియు
న్నవి. డాల్డాతో వండ
బడిన ఆహారము
సులభంగా
జీర్ణమౌ
తుంది.



హిందుస్థాన్ లీవర్ లిమిటెడ్, బొంబాయి

HVM. 313B-19 TL




రిజిష్టర్డు నం: 119923

# డైమండ్ సుగంధవక్క పొడి

## ఉపయోగించువారికి గమనిక

మా 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి అతి రుచికరమైనది, అన్ని విధాలా మిక్కిలి ప్రసిద్ధిచెందినదిన్నీ. మీరు ఈసారి వక్కపొడి కొనేటప్పుడు—"మాకు 'డైమండ్' మార్కు సుగంధవక్కపొడి కావాలి. అదే ఇవ్వండి. ఇతరములు ఏవీ వద్దు" అని కచ్చితంగా చెప్పి, అడగండి.

## ది డి. పి. అండ్ కంపెని,

కౌల్‌బజార్ - బళ్ళారి - 1.

: సేల్సు డిపోలు :

చీరాల - గుంటూరు - కర్నూలు - ఆదోని - హుబ్లి.

# రవి టాయ్‌లెట్స్‌ను వాడండి

## రవి గ్లిసరిన్ సోపు:

మీ అందమును వర్చస్సును కాపాడును.

## రవి వెజిటబుల్ హేరాయిల్:

మీ కేశములను విరివిగా పెంపొందించును.




## రవి స్నో:

మీ ముఖవిలాసమును అభివృద్ధి చేయును.

---

సోల్ ఏజంట్లు:

**ది న్యూ స్టార్ & కంపెని,**

తండియార్పేట :: మద్రాసు-21

---

## ప్రపంచంలోకెల్ల ఎక్కువగా అమ్ముడుపోతున్న సైకిల్స్



ప్రతి నిమిషంలోను, రాత్రింబగళ్లకూడా, ప్రపంచం మొత్తంలో ఎక్కడో ఒక చోట రెండు రాలె బైసికిల్స్ అమ్ముడు పోతూనేవుంటాయి. ఈ రకంలో బహుళ ప్రశస్తి పొందినవి రాలె. రాబిన్ హుడ్‌లు— అందంగా వుంటాయి; మెత్తగా పోతాయి; ఖర్చు అతి తక్కువ.

# రాలె




# రాబిన్‌హుడ్

SRC-48 TEh

PRS 60



ఖైదీ ఎక్కడ?





అతడు Parry's పారీస్ మిఠాయికోసం వెళ్లాడు

అది ఆశ్చర్యం కాదు! పారీవారి మిఠాయి ఎంతో కమ్మగా, ఎంతో స్వచ్ఛంగా వుంటుంది కనుక దానిమీదికి మనస్సు పోకుండా నిగ్రహించుకోలేము.... నేడే పారీ మిఠాయి ఇంటికి తిసుకువెళ్లండి. మీ కుటుంబీకులందరికి పండుగగా ఉంటుంది.

పారీస్ కన్‌ఫెక్షనెరీ లిమిటెడ్ ★ మద్రాసు ★ వారి తయారీ.

# ఎంతో అందముగ కనపడండి
# —బిన్నీవారి అసలైన సిల్కు జార్జెట్
# చీరను కట్టుకోండి



మీరు బిన్నీవారి అసలైన సిల్కు జార్జెట్ చీరను కట్టుకొని చూడండి. మీరు ఎంతో అందముగ కనపడతారు. దాని అపురూపమయిన రంగులు వాడిపోవు లేక తగ్గిపోవు. అది అసలైన సిల్కుతో నేయబడినది కనుక దాని మెత్తదనము మరియు సహజమైన తళతళ చాల కాలము ఉండును.

బిన్నీవారి జార్జెట్ సిల్కు చీరను మీ యిష్టమువచ్చినన్ని సార్లు ఉతుకుకొన్నా, తీక్షణమైన ఎండలో ధరించినా దాని రంగులు ప్రకాశవంతముగా ఉంటాయి మరియు దాని కుచ్చెళ్లు సొగసుగ పాదాల మీద పడుతూ ఉంటాయి.

అందముగ చాల కాలము మన్నే బిన్నీవారి సిల్కు జార్జెట్ చీరలను ఎల్లప్పుడూ కొనండి!

---

బిన్నీవారి యితర సిల్కు చీరలు

<u>మెత్తని సిల్కు చీరలు : పుష్ప</u>

దళమువంటి ఈ మెత్తని సిల్కు చీరలు బంగారు అంచు మరియు సరిక్రొత్త డిజైనులతో తళతళలాడే రంగులలో దొరకుతున్నాయి. వీనిని యింటివద్ద ఉతుకుకోవచ్చును.

<u>క్రేప్ సిల్కు చీరలు :</u> ఈ క్రొత్త, దర్జాగా ఉండే అసలైన సిల్కు చీరలు అందముగ ఒంటిమీద నిలుస్తాయి. దివ్యమైన బంగారు అంచుగల డిజైనులలో దొరకుతున్నాయి.

బిన్నీవారి అసలైన చీరలన్నిటిమీద బంగారు రంగులో యీ ముద్ర వేయబడియున్నది



బెంగుళూరు వులెన్, కాటన్ అండ్ సిల్కు మిల్సు కంపెనీ లిమిటెడ్
మ్యానేజింగ్ ఏజెంట్లు:
బిన్నీ అండ్ కంపెనీ (మద్రాసు) లిమిటెడ్



All keyed up!

ప్రతి మర్ఫీ రేడియో సెట్టు మీ గృహానికి మరింత ప్రతిష్ఠ చేకూర్చటానికి నిర్మించబడింది. ....ఏళ్లతరబడి మీకు మధురగానం వినిపించటానికి సృష్టించబడింది!

# murphy

ఈనాటి అత్యంత ప్రియమైన రేడియో!



SOUNDS GOOD!
LOOKS GOOD!

మోడెల్ 254

* 6-వాల్వ్ 4-బాండు * ఏసి అండ్ ఏసి/డిసి (2 మోడల్సు) * రు. 390 లోకల్ టాక్సులతో సహా

దక్షిణ ఇండియాలో సోల్ ఏజంట్లు: మహమద్ ఇబ్రహీం అండ్ కో., ప్రైవేట్ లి.,
7/8, మౌంట్ రోడ్డు :: మద్రాసు-2
బ్రాంచి : బెంగళూరు.

# ఆరోగ్యమునందు ప్రీతిగలవారు ఎల్లప్పుడూ లైఫ్‌బాయ్‌తో స్నానము చేయుదురు

ఆరోగ్యము కొరకు ఆటలు ఆడుట ఆవశ్యకమైయున్నది — అయితే ఆటయందు గాని లేక పనియందుగాని మనము ఎల్లప్పుడూ మురికిగా నగుదుము. మురికిలో వ్యాధి కారకములగు క్రిములున్నవి. వాటివల్ల మన ఆరోగ్యమునకు ఎడతెగని ప్రమాద మున్నది. లైఫ్‌బాయ్ సబ్బు మురికిలోని క్రిములను కడిగివేసి మిమ్ములను రక్షించును.

లైఫ్‌బాయ్ సబ్బుతో స్నానము చేయుటవల్ల మీరు మరల హాయిగా నుందురు. అలసట మటుమాయమగును. లైఫ్‌బాయ్ సబ్బుతో ప్రతిరోజూ స్నానము చేయుడు — మురికిలోని క్రిముల బారి నుండి మీ ఆరోగ్యమును కాపాడుకొనుడు.




L. 265-50 TL

హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి వారి ఒక తయారి.

## చందాదారులకు మనవి

పైనెల చందమామలు యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. నకాలంలో అందని వారు, వారి పోస్టాఫీసులో ఫిర్యాదుచేస్తూ, పై నెల పదోతేదీ లోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడి వచ్చు కంప్లెయింట్లు, గతనెలలో చేరలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.



## 'చందమామ'కు

ఏజంట్లు లేనిచోట్ల ప్రతి ఊరా చిన్న చిన్న ఏజంట్లు కావాలి. మీరు ఏజంటయి కొద్ది కాపీలుకూడా తెప్పించుకోవచ్చును. మీరు ప్రతినెలా 3-0-0 పంపుతూవుంటే మీకు 8 కాపీలు పంపుతాము. ఈ పద్ధతిని మీకు ప్రతినెలా 1-0-0 లాభం వుంటుంది. పూర్తి వివరాలకు వ్రాయండి.

### చందమామ పబ్లికేషన్సు,

వడపళని, మద్రాసు - 26


## అద్వితీయమైన నాణ్యము! అతి సరసమైన మూల్యము!!







## ఐరిస్ సిరాలు

ఫౌన్టెన్ కలములకు పేరెన్నిక కన్నవి.

1, 2, 4, 12, 24 ఔన్సుల ప్యాకింగులలో లభించును.

తయారుచేయువారు:

### రీసెర్చి కెమికల్ లెబొరేటరీస్

మద్రాసు-4 ★ న్యూఢిల్లీ-1 ★ బెంగళూరు-3

# ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్

స్థాపితం : 1923. హెడ్డాఫీసు : మచిలీపట్టణము.

చెల్లింపబడిన మూలధనము రిజర్వులు కలసి మొత్తం (30-6-57 నాటికి) రు. 56,24,150
డిపాజిట్లు .... .... రు. 10,00,00,000 మించినది.
అమలులో నున్న వ్యాపారమొత్తం .... రు. 11,00,00,000 మించినది.

చైర్మన్—శ్రీ ఎస్. ఆర్. వై. శివరామ ప్రసాద్ బహదూర్‌గారు, యం. ఎల్. ఎ.
డిప్యూటీ చైర్మన్—శ్రీ జల్లు మాణిక్యాలరావుగారు, మచిలీపట్టణము.
మేనేజింగ్ డైరెక్టరు—శ్రీ తాడేపల్లి శ్రీరాములుగారు, మచిలీపట్టణము.

మద్రాసు బ్రాంచీలు—(1) 6. లింగిచెట్టి వీధి, మద్రాసు 1. (2) 87, త్యాగరాయ రోడ్డు, త్యాగరాయనగర్, మద్రాసు 17. (3) 77, కచ్చేరి రోడ్డు, మైలాపూరు, మద్రాసు 4. హైదరాబాదు ఆఫీసు–బి/10-711 సుల్తాను బజారు. సికింద్రాబాదు ఆఫీసు–1359 జనరల్ బజారు. ఆంధ్రరాష్ట్రమంతటా, బళ్లారిలోను, బ్రాంచీలు సబ్ ఆఫీసులు కలవు. అన్నిరకముల డిపాజిట్లు ఆకర్షణీయమైన వడ్డీరేట్లకు తీసుకొనబడును. ఫారిన్ ఎక్స్చేంజి సహా అన్నిరకముల బ్యాంకింగు వ్యాపారములు చేయబడును. లండన్ ఏజెంట్లు—(1) బార్‌క్లేస్ బ్యాంకు లిమిటెడ్, చీఫ్ ఫారిన్ బ్రాంచి, 168 ఫెన్‌చర్చి స్ట్రీట్, లండన్, ఇ. సి. 3. (2) ది బ్యాంక్ అఫ్ బరోడా లి, 108 ఓల్డ్ బ్రాడ్ స్ట్రీట్, లండన్, ఇ సి. 2. (3) ది ఫస్ట్ నేషనల్ సిటీ బ్యాంకు అఫ్ న్యూయార్క్, 117 ఓల్డు బ్రాడ్ స్ట్రీటు, లండన్, ఇ. సి. 2.

వివరములు బ్యాంకు యొక్క ఏ ఆఫీసులోనైనను తెలుసుకొనవచ్చును.

తుంపూడి రంగనాథ భగవత్ బి.ఏ.,బి.ఎల్.,
ఆక్టింగ్ జనరల్ మేనేజరు.




లిలీస్
మాల్టో
బిస్కతులు
బిడ్డలకు ప్రియమైనవి.

LILY BISCUIT CO. PRIVATE LTD., CALCUTTA-4

మీయొక్క దేహ సౌఖ్యమునకును,
అందమునకును

ఆర్సిల్లా - ఆల్ఫా - మ్యాక్టి ఆక్సైడ్ -
విచ్‌హాసిల్ తో చేరిన




ఫెస్టివల్
సూపర్ శాండల్ టాల్కం పౌడర్
అండ్ స్నో

తయారుచేయువారు :-
మురళీ ట్రేడర్సు, కాస్మెటిక్స్ డిపార్టుమెంటు
మదరాసు - 21.

Ramu

ఆంధ్రజిల్లాలకు ఏజంట్సు : శివకోటి లక్ష్మీనరసింహము, విజయవాడ.

మా పనితనమును

గురించి గొప్పగా

చెప్పటము కాదు

# అత్యుత్తమంగా

చేసి చూపుతాము

★

పోస్టర్లు
క్యాలెండర్లు
కార్డ్లను
లేబిల్సు
బుక్లెట్సు
ఫోల్డర్లు

అఫ్‌సెట్ ప్రింటింగులో ఏది కావలసినా సరే

మేలైన ముద్రణకు గుర్తు



## ప్రసాద్ ప్రాసెస్ (ప్రైవేట్) లి. మదరాసు - 26

బొంబాయి ప్రతినిధి కార్యాలయం :
లోటస్ హౌస్, మెరీన్ లైన్స్, బొంబాయి - 1.
ఫోన్ : 241162



1893 నుంచి
జలుబులకు

ఇప్పటికి మూడు తరాలనుంచీ
అమృతాంజనం జలుబులనుండి
శీఘ్రమైన విముక్తికోసం
వాడబడుతున్నదని అంద
రికీ తెలిసిన విషయమే.

# అమృతాంజనము

అమృతాంజన్ లి.,
మద్రాసు 4.
మరియు బొంబాయి 1, కలకత్తా 7.




AL.57.2A.TEL.




టీనమయూన, పార్లీస్
మొనాకో సాల్టెడ్ స్నాక్సును
కోరుకొనుటకు ఆమెను ప్రోత్సహించింది, ఆమెకు గల
మంచి అభిరుచే. కరకరమంటూ, సులువుగా జీర్ణమయ్యే
ఈ పార్లీ బిస్కత్తులు ఆమె నాజూకుదనాన్ని
కాపాడుతున్నవి.



పార్లేవారి
# మొనాకో
భారతదేశపు మొట్టమొదటి
శ్రేష్టమైన
**ఖారా బిస్కట్లు**

పార్లీ (ప్రోడక్ట్సు) మాన్యుఫాక్చరింగ్ కంపెనీ ప్రైవేట్ లి., బొంబాయి

PM 57.6

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

సోవియెట్ శాస్త్రవేత్తలు భూమిచుట్టూ తిరిగే రెండు చందమామలను ఏర్పాటు చేశారు. రెండవ చందమామలో ఒక బతికివున్న కుక్కనుకూడా పంపారు. ఇది రాకెట్ ప్రయోగ ప్రక్రియలో ఒక గొప్ప పరిణామాన్ని సూచిస్తున్నదని ప్రపంచ శాస్త్రజ్ఞులు చెబుతున్నారు.

ఇంతకన్నకూడా వింత అయిన విషయ మేమంటే మనుషులు బొందెతో అసలు చందమామకు వెళ్లి రావటం అనేది సుసాధ్యమని నమ్మటాని కిప్పుడు అవకాశం లభించింది.

చందమామ మన భూమికి అత్యంత సన్నిహితంగా ఉన్న ఖగోళం. అది సుమారు రెండున్నర లక్షల మైళ్ళ దూరాన వున్నది. ఎంతో కాలంగా మానవులు దానివద్దకు ప్రయాణించాలని కలలు కన్నారు. ఆ కలలు నిజమయే అవకాశం దగ్గిరపడటం చాలా సంతోషదాయకం.



సంపుటి 21 డిసెంబర్ 1957 సంచిక 6



# అట్టవిూది బొమ్మ

సుశర్మ దక్షిణ గోగ్రహణం చేసిన వెనువెంటనే దుర్యోధనుడు భీష్మ ద్రోణ కర్ణ కృప శకుని దుశ్శాసనాశ్వత్థామలతో సహా తన బలాలను వెంటబెట్టుకుని మత్స్య దేశానికి ఉత్తరంగా ఉన్న అరువేల గోవులను పట్టుకున్నాడు.

అక్కడి గోపాలకులు వెంటనే బయలుదేరి విరాటనగరం వెళ్ళి, స్త్రీజనం మధ్య కూచుని కబుర్లుచెబుతున్న విరాటరాజు కొడుకును, ఉత్తరకుమారుణ్ణి, చూసి, జరిగిన సంగతి చెప్పి, "మహారాజా, యిప్పుడు మీరే దిక్కు. మీరు వెంటనే బయలుదేరి వచ్చి, కౌరవులతో యుద్ధంచేసి మన గోగణాలను విడిపించండి!" అన్నారు.

దానికి ఉత్తరుడు, "అయ్యో, నాకు తగిన సారథి లేకపోయెనే! ఉన్నట్టయితే ఒంటరిగా బయలుదేరి వెళ్లి ఆ కౌరవ బలాలతో అర్జునుడిలాగా పోట్లాడి, అందరినీ ఓడించి ఉందును," అన్నాడు. ఆ మాట వినగానే ద్రౌపది, "మహారాజా, మన బృహన్నల అర్జునుడికి సారథ్యం చేసినవాడు. అతన్ని వెంటబెట్టుకు పోయినట్టయితే కౌరవులమీద సులువుగా గెలుస్తారు!" అన్నది.

ఉత్తరుడు తన చెల్లెలైన ఉత్తరను నర్తనశాలకు పంపి బృహన్నలను పిలిపించాడు. బృహన్నల, "రాజకుమారా, నేను పాడగలను, ఆడగలను గాని రథసారథ్యం నావల్ల ఏమవుతుంది!" అన్నాడు.

"ఆటలూ పాటలూ తరవాత చూడవచ్చు. ముందు రథాన్ని సిద్ధంచెయ్యి. ఇదిగో ఈ కవచం ధరించు," అంటూ ఉత్తరుడు బృహన్నలకు ఒక కవచం ఇచ్చాడు. దానిని ధరించటం తెలియనివాడులాగా బృహన్నల తన శరీరంమీద కప్పుకున్నాడు. అక్కడ ఉన్న స్త్రీలందరూ విరగబడి నవ్వారు. ఉత్తరుడు బృహన్నలకు తానే స్వయంగా కవచం తొడిగాడు.

తరవాత ఉత్తరుడు ధనుర్బాణాలు తీసుకుని, రథానికి సింహధ్వజం ఎత్తి బృహన్నలతోసహా రథం ఎక్కాడు. ఉత్తర బృహన్నలతో, "యుద్ధంలో గెలిచి వచ్చేటప్పుడు నా బొమ్మల పాత్తిళ్ళకుగాను మంచిమంచి బట్టలు తీసుకురండి," అని అడిగింది.

"మీ అన్న యుద్ధంలో గెలిస్తే అలాగే తెస్తాం," అంటూ బృహన్నల రథాన్ని బయలుదేరదీశాడు.




# మూగవాడు

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలిస్తున్న కాలంలో మద్రదేశపు రాజుకూతురు చంద్రాదేవి అయనకు పట్టపురాణిగా ఉండేది. ఎంతకాలం గడిచినా అమెకు సంతానం కలగలేదు. యువరాజు లేనందుకు ప్రజలు విచారించి, రాజువద్దకు వెళ్ళి, పిల్లలు కలగటానికి ఏవైనా వ్రతాలు చెయ్యమన్నారు.

ఆ ప్రకారమే చంద్రాదేవి అనేక వ్రతాలు చేసింది. ఆమె ఒక పౌర్ణమీ పుణ్యదినాన ఉపోషం ఉండి, "నేనే శీలవతినైతే నాకు ఒక మగపిల్లవాడు కలగాలి!" అనుకున్నది.

దేవతలకు రాజైన ఇంద్రుడు చంద్రాదేవి కోరిక నెరవేర్చటానికి నిశ్చయించి, ఆమె గర్భవాసాన జన్మించగలవా డెవడా అని ఆలోచించేసరికి అయనకు బోధిసత్వుడు జ్ఞాపకం వచ్చాడు.

బోధిసత్వుడు అదివరకు ఒకప్పుడు కాశీరాజుగా జన్మించి, ఇరవై ఏళ్ళు పరిపాలించి, ఆ ఇరవైఏళ్ళ పరిపాలనలోనూ తాను చేసిన పాపాలకు ప్రాయశ్చిత్తంగా ఎనభైవేల ఏళ్ళు ఉష్ణదనరకం అనుభవించి, తరవాత దేవలోకంలో ఉండి, అక్కడ తన కాలం తీరిపోగా ఊర్ధ్వలోకాలకు వెళ్ళిపోవటానికి సిద్ధమవుతున్నాడు.

ఇంద్రుడు ఆ సమయంలో బోధిసత్వుడివద్దకు వెళ్ళి, "మిత్రమా, నీవు వెళ్ళి మానవలోకంలో జన్మించినట్టయితే ఎంతో పుణ్యం సంపాదించటమే గాక, మానవకోటిని ఉద్ధరించగలుగుతావు. కాశీరాజూ, అయన భార్య చంద్రాదేవీ పుత్రుణ్ణి కోరి ఎన్నో వ్రతాలు చేస్తున్నారు. వారి కుమారుడివై జన్మించు!" అని కోరాడు. ఇందుకు బోధిసత్వుడు సమ్మతించాడు.

బోధిసత్వుడు చంద్రాదేవి గర్భం ప్రవేశించిన సమయానే అతని అనుచరులైన దేవతలు అయిదువందలమంది కాశీరాజు



పిల్లవాడికి బారసాల చేసి తేమియుడని పేరు పెట్టుకున్నారు. ఆ సమయంలో రాజు సిద్ధాంతులను, "పిల్లవాడికి అరిష్టాలేమైనా ఉన్నాయా?" అని అడిగాడు. వారు లక్షణాలన్నీ పరిశీలించి, "రాజా, ఈ కుర్రవాడికి ఎట్టి ప్రమాదాలూ లేవు. పూర్ణాయువవుతాడు!" అని చెప్పారు.

తేమియుడు ఒకనెల వయసు గలవాడై ఉండగా, అతన్ని చక్కగా అలంకరించి సభలో వున్న రాజుగారివద్దకు తీసుకువెళ్లారు. రాజు తన కొడుకును ఒడిలో కూచోబెట్టుకుని ఆడించసాగాడు. ఈ సమయంలో నలుగురు దొంగలను రాజుగారి ఎదట విచారణకు తెచ్చారు. రాజుగారు నలుగురినీ విచారించి, ఒక దొంగను వెయ్యి కొరడా దెబ్బలు కొట్టమనీ, రెండవవాణ్ణి యావజ్జీవం కారాగృహంలో ఉంచమనీ, మూడవవాణ్ణి ఈటెలతో పొడవమనీ, నాలుగవవాణ్ణి కొరత వెయ్యమనీ ఉత్తరువిచ్చాడు.

పూర్వజన్మజ్ఞానం గల బోధిసత్వుడు ఇదంతా చూసి, "అయ్యో, నా తండ్రి రాజు అయిన కారణంచేతగదా నరకాన్ని కోరి తెచ్చుకునే పనులు చేస్తున్నాడు. నేను ఒకప్పుడు ఇరవైఏళ్లు రాజుగా ఉన్నందువల్ల ఎనభైవేల ఏళ్లు ఉష్ణదనరకం అనుభవిం

పరివారంలోని వారి భార్యల గర్భాలలో ప్రవేశించారు.

సకాలంలో బోధిసత్వుడు చంద్రాదేవి గర్భాన అనేక శుభలక్షణాలతో జన్మించాడు. ఆ రోజునే మిగిలిన అయిదువందలమందీ పుట్టారు. వారందరూ తన కుమారుడితోబాటు పెరిగి, అతనికి అనుచరులుగా ఉండాలని రాజు ఉత్తరువిచ్చాడు. తన కుమారుడికి పాలివ్వటానికి అరవైనాలుగుమంది దాదీలను ఏర్పాటు చేశాడు. తరవాత ఆయన తన పట్టపురాణివద్దకు వెళ్ళి ఏదైనా ఒక వరం కోరుకోమన్నాడు. ఆమె సమయం వచ్చినప్పుడు కోరుకుంటానన్నది.



చాను. మళ్ళీ నేనీ దొంగల వంశంలో జన్మించానేమిటి? తాను దొంగ అన్నది తెలియక నా తండ్రి నలుగురు దొంగలకు అతి క్రూరమైన శిక్షలు విధించాడు. నేనుకూడా రాజునైనానంటే నాకు నరకప్రాప్తి తప్పదు!" అనుకున్నాడు.

అది మొదలు అతనికి ఈ దొంగ బ్రతుకు తప్పించుకోవటం ఎలాగా అని విచారం పట్టుకున్నది. అతని బంగారు శరీరం వాడినట్టయిపోయింది. అప్పుడతనికి తన పూర్వజన్మ తాలూకు తల్లి కనిపించి, "భయపడకు, నాయనా. ఈ పాపపు జీవితం నుంచి తప్పించుకోవాలంటే కాళ్ళులేని వాడిలాగా, మూగవాడిలాగా, చెవిటివాడిలాగా, మతి లేనివాడిలాగా నటించు!" అని హెచ్చరించింది. తేమియుడు అలాగే చేయ నిశ్చయించాడు.

రాజుగారి ఆజ్ఞప్రకారం బోధిసత్వుడున్న చోటనే మిగిలిన అయిదువందలమంది పిల్లలనూ ఉంచారు. మిగిలిన వారంతా ఆకలి కాగానే పాలకోసం ఏడవసాగారు. కాని, వారందరిలో బోధిసత్వుడు ఒక్కడే ఏడవలేదు; "ఈ లోకంలో నరకం అనుభవించటంకన్న ఆకలికి మాడిచావటం చాలా రెట్లు నయం," అనుకున్నాడు.



దాదీలు వెళ్ళి రాజకుమారుడు పాలకోసం ఏడవటంలేదని రాణీతో చెప్పారు. ఆమె ఈ సంగతి రాజుతో అన్నది. రాజు బ్రాహ్మణులను పిలిపించి వారి సలహా అడిగాడు.

"పిల్లవాడు పాలకోసం ఏడవ నవసరం లేదు. సరిఅయిన వేళకు పాలిస్తే గుటగుటా తాగేస్తాడు," అన్నారు బ్రాహ్మణులు. దాదీలు అలాగే చేస్తూవచ్చారు. కాని పరీక్షకుగాను వారు ఒకసారి పాలు ఇవ్వటం మానేస్తే పిల్లవాడు ఏడిచేవాడు కాడు. ఇది వారికి ఆశ్చర్యం కలిగించింది. అదీకాక, మిగిలిన పిల్లల్లాగా అతను చేతులూ, కాళ్ళూ కదిలించి ఆడుకోలేదు, కేరింతాలు కొట్ట



లేదు. అతని గొంతునుంచి ఏ చప్పుడూ లేదు. చిటికెలు వేస్తే విననట్టుగా కనబడేవాడు. దీనికి కారణమేమిటో ఎవరూ తెలుసుకోలేకపోయారు.

ఈ విధంగా ఒక ఏడాది గడిచింది. ఒకనాడు దాదీలు మిఠాయి తెచ్చి పిల్లలందరి మధ్యా పెట్టి, "తినండి!" అని చాటుకు వెళ్ళి ఏం జరుగుతుందో అని చూడసాగారు. మిగిలిన పిల్లలందరూ ఎగబడి మిఠాయి తిన్నారు. ఒకరి చేతిలోది ఒకరు లాక్కున్నారు. తేమియుడుమాత్రం కొంచెంకూడా ఆసక్తి కనబరచలేదు. ఇది చూసి రాణి గుండె చెరువై పోయింది. ఆమె మిఠాయి తెచ్చి, "తిను, తండ్రీ!" అని తన చేత్తో అతని నోటపెట్టింది.

అయిదేళ్లు గడిచాయి. అయిదేళ్లు నిండిన పిల్లలకు నిప్పు భయం తెలుస్తుంది. నిప్పు చూసి తేమియుడు భయపడతాడేమో చూస్తామని రాజుగారు పిల్లలకోసం ఒక పెద్ద పాక వేయించి, దానిపైన తాటాకులు వేయించారు. అందులో పిల్లలందర్నీ ఉంచారు. తరవాత ఆ పాకకు నిప్పు అంటించారు. నిప్పు చూడగానే మిగిలిన అయిదు వందలమంది పిల్లలూ భయపడి పారిపోయారు. తేమియుడు మాత్రం, "నరకంలో మగ్గటంకన్న ఈ మంటలలో చావటమే నయం," అనుకుని నిర్లిప్తుడుగా వుండిపోయాడు. మంటలు అతనిదాకా వచ్చే సమయానికి అతన్ని ఎవరో ఎత్తుకుని ఇవతలికి రావలిసి వచ్చింది.

తేమియుడు ఏడేళ్ళవాడయాడు. కొన్ని తాచుపాములకు కోరలు పీకేసి, మూతులు కుట్టి పిల్లలందరూ వున్నచోట వదిలారు. మిగిలిన పిల్లలందరూ బెదిరి పారిపోయారు గాని తేమియుడు కూచున్న చోటనుంచి కదలలేదు. పాములు అతని శరీరంనిండా పాకాయి, అతని నెత్తిన పడగలు విప్పి పట్టాయి. అయినా అతను చలించలేదు.





అతని కాళ్లలో ఏ లోపమూ లేదు. చెవులూ, నోరూకూడా వుండవలసినట్టుగానే వున్నాయి. అతను ఎందుకు కదలడో, ఎందుకు మాట్లాడడో, ఎందుకు వినడో ఎవరూ ఊహించలేకపోయారు. పిల్లల వినోదంకోసం నాటకాలాడారు. వినోదం చూసి మిగిలిన పిల్లలందరూ నవ్వారు గాని తేమియుడు నవ్వలేదు. ఒకడు కత్తితో నృత్యంచేస్తూ, "ఏడీ ఆ రాజకుమారుడు? వాణ్ణి శిరచ్ఛేదం చేస్తాను!" అంటూ కత్తి చాచి తేమియుడి మీదికి భయంకరంగా వచ్చాడు. మిగిలిన పిల్లలు కెవ్వున అరిచి పారిపోయారు, కాని తేమియుడు కాస్తకూడా చలించలేదు. నృత్యగాడు తన నటన చాలించి అక్కడి నుంచి వెళ్ళిపోయాడు.

ఈ విధంగా అతనిలో చైతన్యం కలిగించటానికి ఎన్నో చేశారు. అతని చుట్టూ అకస్మాత్తుగా శంఖాలు ఊదారు; అదేపనిగా డప్పులు వాయించారు; అతని శరీరానికి బెల్లపునీరు పట్టించి, మీద ఈగలు వాలి బాధపెట్టేటట్టు చేశారు; అనేక రోజులపాటు పళ్ళు తోమక, నీళ్ళు పొయ్యక ఉంచారు; అతని శరీరంనుంచి దుర్గంధం పుట్టింది; అప్పుడు అందరూ అతన్ని హేళన చేస్తూ, "ఏమిటిది? లేచివెళ్ళి నీళ్ళు పోసుకోరాదా? శుభ్రంగా ఉండాలన్న జ్ఞానంకూడా లేదూ?" అన్నారు. ఆఖరుకు అతని మచంకింద మంటలు పెట్టారు.

ఆ మంటలకు అతని శరీరం బొబ్బ లెక్కసాగింది. "ఆ మంటలకంటే ఈ మంటలే నయం," అనుకుని తేమియుడు ఏమాత్రమూ చలించలేదు.

అతను చలించకపోయినా, లేకలేక కన్న అతని తల్లిదండ్రులు చలించారు. వారి కడుపు తరుక్కుపోయింది. వారీ పరీక్షలన్నీ కట్టిపెట్టించి, కొడుకువద్దకు వెళ్ళి ప్రాధేయపడ్డారు. "నాయనా, నీలో ఏ అవలక్షణమూ లేదు, మాకు తెలుసు! ఎన్నో



నోములు నోచి నిన్ను కన్నాం. నువ్విలా మన్నుదిన్న పాములాగా పడివుండటం మాకు ఎంతో అవమానంగా వుంది! లేచి మామూలు మనిషిలాగా తిరుగు, నాయనా!" అని ఎన్నోసార్లు వేడుకున్నారు. అయినా లాభం లేకపోయింది.

తేమియుడికి పదహారేళ్ళు నిండాయి. "ఎంత కాళ్ళు లేనివాడైనా, మూగవాడైనా, చెవిటివాడైనా, యుక్తవయసు వచ్చాక ప్రేమ అన్నది కలగకుండా ఉండదు. అందుచేత మనవాణ్ణి ఆకర్షించటానికి నాట్యగత్తెలను నియోగిస్తాను. వారందరూ వాడి చుట్టూ ఆడుతూ, నృత్యం చేస్తూవుంటే, ఒకతె అయినా వాడి మనస్సును ఆకర్షించవచ్చు. అలా ఆకర్షించినదాన్ని వాడికి పట్టపురాణిగా చేస్తాను!" అన్నాడు రాజు.

తేమియుడికి పన్నీట స్నానంచేయించి, మంచిబట్టలు ధరింపజేసి, ఇంద్రభవనం లాటి భవనంలో హంసతూలికా తల్పం మీద పడుకోబెట్టారు. ఆ భవనంనిండా పూలూ, అత్తరువులూ, సాంబ్రాణీ, మద్యపానీయాలూ అమర్చారు. అక్కడికి అనేక మంది నృత్యంచేసే యువతులు వచ్చారు. వారు తమ ఆటలతోనూ, పాటలతోనూ, మాటలతోనూ రాజకుమారుణ్ణి రంజింపజేయటానికి విశ్వప్రయత్నాలు చేశారు. కాని అతను ఆ నృత్యంచేసే యువతుల గాలి సోకితే ఏమవుతుందోనని ఊపిరికూడా పీల్చక కొయ్యలాగా అయిపోయాడు.

చివరకా యువతులు ప్రాణంవిసిగి రాజుగారిపద్దకు వెళ్ళి, "మీ కుమారుడు మనిషి కాడు, రాకసి అయివుండాలి. మేము నాట్యం చేస్తూ దగ్గిరికి పోతే నిలువునా కొయ్యబారి పోయాడు!" అని చెప్పారు.

ఈ విధంగా పదహారేళ్లపాటు సాగించిన ప్రతి పరీక్షా బూడిదలో పోసిన పన్నీరయిపోయింది. తేమియుడి రహస్య మేమిటో ఎవరికీ తెలియలేదు. (ఇంకా ఉంది.)






## 12

[ అన్నలు కోరగా పింగళుడు ఓడసరంగుకు తన ఇంటిలో ఆతిథ్యం యివ్వటానికి అంగీకరించాడు. ముందు అనుకున్నప్రకారం, ఓడసరంగు తన అనుచరుల సాయంతో పింగళుణ్ణి బంధించి తన పడవమీదికి తీసుకుపోయాడు. అన్నలిద్దరూ ఇంటికి వచ్చి, తల్లినికొట్టి పింగళుడు తెచ్చిన ధనాన్ని, మహత్తు గల సంచీనీ చేజిక్కించుకున్నారు. తరవాత—]

జీవదత్తుడూ, లక్షదత్తుడూ కలిసి ఎంతో ఆత్రంగా పింగళుడు తెచ్చిన ధనపుసంచి మూతి విప్పి, అందులో గల బంగారాన్నీ, వెల లేని మణిముత్యాలనూ చూసి మూర్ఛ పోయినంత పనిచేశారు. పింగళుడు ఏదో కొంత ధనం సంపాయించుకు వచ్చాడని తప్ప, యింత పెద్ద మొత్తం తెచ్చాడని మాత్రం వాళ్లు కలలోకూడా అనుకోలేదు.

"ఈదెబ్బతో మన దరిద్రమే కాక, అటూ యిటూ ఏడు తరాల దరిద్రంకూడా తీరి పోతుంది," అన్నాడు జీవదత్తుడు.

"అవున్రా అన్నా, అవును! మనదగ్గిర యింత డబ్బు వున్నదని తెలిస్తే, యీ అవంతీ నగరపు రాజుగారే మనకు పిల్లల్ని యిచ్చేందుకు మంత్రితో సహా బయలుదేరి మన యింటికి వస్తాడు," అన్నాడు లక్షదత్తుడు వుత్సాహంగా.

కొడుకులిద్దరూ యీవిధంగా మాట్లాడుకోవటం విన్న తల్లికి, వాళ్లమీద ఎక్కడలేని వాత్సల్యమూ పుట్టుకొచ్చింది. ఆ నిమిషం వరకూ వాళ్లిద్దరూ తనను తిట్టికొట్టిన సంగతి మరిచిపోయి ఆమె, "అయితే నాయనలారా,



మీరిద్దరూ ఒక పనిచెయ్యండి. పూర్వంలాగా వున్న డబ్బంతా దుర్వ్యసనాలకు ఖర్చు పెట్టక, హాయిగా పెళ్లాడి ఒక యింటివాళ్లు కండి! నేను మీ పంచనే వుండి కాలం వెళ్లబుచ్చుతాను," అన్నది.

తల్లి యిలా అనేసరికి కొడుకులిద్దరూ పాముల్లాగా బుసలుకొట్టి చుర్రుమంటూ లేచారు. "మేం కావాలంటే పెళ్ళిళ్ళు చేసుకుంటాం, లేకపోతే బైరాగుల్లా తిరుగుతాం, ఆ సంగతి నీకెందుకు? నీకు మామీద ఏమాత్రం పుత్రప్రేమ లేదని మాకు తెలుసు. నీకు సర్వం ఆ పింగళుడే! కల్లబొల్లిమాటల్తో మమ్మల్ని మోసగించి, యీ మా తండ్రి



ఆస్తిలో పాలుపంచుకోవాలని చూస్తున్నావు, అవునా?" అన్నారు.

"అది మీ తండ్రి గడించిన ఆస్తి కాదు, పింగళుడి కష్టార్జితం. దాన్ని ఎలాగూ మీరు పంచుకోబోతున్నారు గనక నేనేమీ చేయగలిగిందిలేదు. నేను కోరేదల్లా ఆ మహత్తుగల సంచీ నాకివ్వమని. అది నాదగ్గిర వుంటే మీరు కావలసినప్పుడల్లా, ఇంటికి వచ్చి, యిష్టమొచ్చిన విందుభోజనం చేసి వెళ్ళవచ్చును. నేనూ లోగడలాగా కూటికి వాచి అక్కడా యిక్కడా బిచ్చమెత్తవలసిన అవసరం కలగదు," అన్నది తల్లి.

"నువ్వు ముమ్మాటికీ నా తల్లివి కాదు. అలాటప్పుడు నువ్వు బిచ్చమెత్తితే నాకేం!" అన్నాడు జీవదత్తుడు యీసడింపుగా.

"అంతేరా అన్నా, అంతే! మన అయ్య ఆస్తిని దాచి చిన్నకొడుక్కి మూటకట్టి ఒప్పచెప్పాలని చూస్తున్నమనిషి మనకు తల్లి ఎలా అవుతుంది?" అన్నాడు లక్షదత్తుడు.

ఇక వాళ్లతో వాదించి లాభంలేదని తల్లి నిస్పృహ చెంది, గోడకు చేరగిలబడింది. జీవదత్తుడూ, లక్షదత్తుడూ కలిసి పింగళుడు తెచ్చిన ధనాన్ని భాగాలు వేసుకున్నారు. ఆ పని ముగిసిం తరవాత మహత్తుగల సంచిని గురించి వాదన ప్రారంభమయింది.







అన్నదమ్ములిద్దరూకూడా ఆ సంచి నాకు కావాలంటే నాకు కావాలని పోట్లాటకు ఉపక్రమించారు. అది క్రమంగా ముదిరి హద్దులు దాటి ఒకరి గొంతు ఒకరు పట్టుకునే దశకు వచ్చింది. తల్లి వారిద్దరినీ సమీపించి బతిమాలుతూ, "నాయనలారా, మీరు పోట్లాడుకుని ఒకళ్ళకొకళ్లు హానికలిగించుకో కండి. మీరు నన్ను ఎంత యీసడించినా, మీరు నా పుత్రులన్నసంగతి నేనెలా మరిచి పోగలను? సావధానపడి ఆ సంచీ నాదగ్గిర వుంచండి, అప్పుడు మీరు దెబ్బలాడుకో వలసిన అవసరం కలగదు," అన్నది.

"సంచీలో నావంతు నేను పుచ్చుకుంటాను," అంటూ జీవదత్తుడు వంటగదిలోకి పరిగెత్తి కత్తిపీట తీసుకువచ్చి, సంచీని అడ్డంగా కోయబోయాడు. కాని తల్లి అతడికి అడ్డుపడి, "నాయనా, జీవదత్తా! ఆ పని చేయకు. ఒకసారి దాన్ని ముక్కలుచేశావే, దాని మహత్తంతా పోతుంది. దాన్ని ఎవరో ఒకరు మొత్తంగా వాడుకోవలసిందేగాని, ముక్కలుచేసి లాభంలేదు," అన్నది.

"అయితే, ఆ సంచీ నాకే కావాలి!" అన్నాడు లక్షదత్తుడు.

"ఛీ వెధవా! నేను యింటికి పెద్దవాణ్ణి, జ్యేష్ఠపుత్రుణ్ణి. యిలాంటి మహత్తుగల వస్తువులన్నీ అలాంటివాడికే చెందుతవని శాస్త్రాలూ, పురాణాలూకూడా ఘోషపెడుతున్నవి," అన్నాడు జీవదత్తుడు.

ఈవిధంగా యింట్లో అన్నదమ్ములమధ్య జరుగుతున్న కలహాన్ని, ఆరాత్రి పట్టణంలో గస్తీ తిరుగుతున్న అవంతీనగర కొత్వాలు ఒకడు విన్నాడు. అతడికి ధనం సంగతీ, మహత్తుగల సంచీ సంగతీ క్షుణ్ణంగా తెలిసి పోయింది. అతడు సూర్యోదయంవేళకే రాజుగారిదగ్గిరకు వెళ్లి, తను విన్నసంగతి యావత్తూ ఆయనకు నివేదించాడు.

అసలే ఆ అవంతీనగరరాజు పరమ పిసినిగొట్టు. అలాంటివాడికి యీ రహస్యం





చెవులబడేసరికి ఎక్కడలేని దురాశా పుట్టు కొచ్చింది. ఆయన వెంటనే తన దండనాయకుణ్ణి పిలిపించి ఆ అన్నదమ్ములనూ, ఆ యింట్లో వున్న అన్ని వస్తువులనూ—పూచిక పుల్లతోసహా కదిలించుకుని తన ఆస్థానానికి పట్టించుకు రావలసిందిగా ఆజ్ఞాపించాడు.

దండనాయకుడు భటులను వెంట వేసుకువెళ్లి, జీవదత్తుణ్ణీ, లక్షదత్తుణ్ణీ చేజిక్కించుకున్నాడు. తరవాత యిల్లంతా గాలించి ధనాన్నీ, మహత్తుగల సంచీనీ దొరకపుచ్చుకోవటమే గాక, యింట్లోవున్న సామానుకూడా వశపరుచుకుని, బళ్లమీద రాజాస్థానానికి చేరవేశాడు.

జీవదత్తుడూ, లక్షదత్తుడూకూడా రాజుతో జరిగిన సంగతేమిటో చెప్పటానికి నిరాకరించారు. కాని, రాజు భటులచేత నాలుగైదు కొరడాదెబ్బలు కొట్టించేసరికి, వాళ్లిద్దరూ మొదటినుంచీ జరిగిన కథ యావత్తూ ఆయనకు వినిపించారు.

"అయితే యీ ఆస్తి మీది కాదన్న మాట!" అంటూ రాజు సంతోషంగా నవ్వి, "రాజ్యంలో హక్కుదారులంటూ లేకుండా వున్న ఆస్తి యావత్తూ న్యాయశాస్త్రరీత్యా నాకే చెందుతుంది. మీరు మీ తమ్ముడని చెప్పబడే ఆ పింగళుణ్ణి బానిసగా అమ్మేశారు. కనుక అతడికి యిక ఆస్తిహక్కులు గాని, పౌరహక్కులుగానీ, ఏమీ వుండవు. ఇక మీ యిద్దరి సంగతి: మీరు మీదికాని ఆస్తిని రహస్యంగా పంచుకునేందుకు ప్రయత్నించినందుకుగాను, ఇరవైఏళ్లు కారాగార శిక్ష విధిస్తున్నాను," అన్నాడు.

"మహారాజా! మమ్మల్ని కరుణించి విడిచిపుచ్చండి. ఆ ధనంగాని, మహత్తుగల సంచీగాని మాకు అవసరంలేదు. స్వేచ్ఛగా బతికేందుకు అనుజ్ఞయివ్వండి, అంతే చాలు," అన్నారు జీవదత్తుడూ, లక్షదత్తుడూ.

కాని రాజుకు వాళ్లను స్వేచ్ఛగా వదలటం యిష్టంలేదు. అలా వదిలిస్తే వాళ్ళు





ప్రజలమధ్యకు వెళ్లి, తనుచేసిన అన్యాయం సంగతి ఏకరువుపెడతారు. అప్పుడు ప్రజల్లో కొందరికైనా తన మీద అసంతృప్తి కలగవచ్చు.

"మీకై మీరు చేసిన నేరాలన్నీ ఒప్పుకోవటమే గాక, కన్నతల్లిని హింసించిన సంగతికూడా యదార్థం అని అంగీకరిస్తున్నారు గనక, మీకు కారాగార శిక్ష తప్పదు. పోతే, మీతల్లికి జీవితకాలంపరకూ నెలకు పది మొహరీలు భరణం యిస్తున్నాను," అంటూ రాజు తీర్పుచెప్పి, తన వుద్యానవనంకేసి వెళ్ళిపోయాడు.

రాజభటులు జీవదత్తుడికీ, లక్షదత్తుడికీ కాళ్ళకు యినపగొలుసులు తగిలించి, వాటికి పెద్ద యినపగుండు తాపడంచేసి, చీకటి కోణంగా వున్న ఒకానొక కారాగారపు గదిలోకి వాళ్ళను యీడ్చుకుపోయి వదిలి, బయట తలుపులకు తాళం బిగించారు.

అన్నదమ్ములిద్దరూ తమకు పట్టిన దుర్గతికి ఎంతో వాపోయారు. ఆ నిమిషంలో వాళ్ళకు తమ్ముడికీ, కన్నతల్లికికూడా తీరని ద్రోహం చేశామన్న పశ్చాత్తాపం కలిగింది. అయినా, అంతా మించిపోయిం తరవాత యిప్పుడు తాము చేయగలిగిందేమీ లేదు. చీకటీ, దుర్గంధం, తడీ పాడీగా వున్న నేలా, నీళ్ళోడుతున్న గోడలూ—అలాంటి నరక కూపంలో వాళ్లిద్దరూ ఎంతోసేపు దుఃఖించి, చివరకు సొమ్మసిల్లి నిద్రపోయారు.

* * *

అన్నలిద్దరూ కలిసి చేసిన ద్రోహం ఫలితంగా పింగళుడు ఓడసరంగుకు బానిసగా దొరికిపోయాడుగదా ? ఇక ఆ సరంగు పింగళుణ్ణి తన ఓడలోని మిగతా బానిసలతో పాటు తెడ్డువేసే చోటున వున్న యినప కమ్మీకి గొలుసులతో బంధించాడు. తెల్లవారుతూనే ఓడ లంగరు ఎత్తబడింది. సరంగు ఆజ్ఞ కాగానే దాన్ని బానిసలు తెడ్డు వేసి సముద్రంలోపలికి మళ్ళించారు.





ఈ సరంగు పైకి మామూలు పెద్ద మనిషిలాగా కనిపించినా, నిజానికి పేరు మోసిన ఓడదొంగ. వ్యాపారవస్తువులను ఒక రేవునుంచి మరో రేవుకు తీసుకువెళ్లే మిషతో, అతడు ఎక్కడ ఏ రేవులో ఎలాంటి సరుకు ఓడలకు ఎత్తబడుతున్నదీ పసికట్టి—ఆ ఓడలను మహాసముద్రాలమీద అటకాయించి దోచుకుంటూ వుండేవాడు. అలా దోచుకున్న ఓడలలోని వారినందరినీ అతిక్రూరంగా సముద్రం పాలు చేస్తూండేవాడు. ఒకవేళ వారిలో ఎవరినైనా ప్రాణాలతో వదిలితే, వారు తన నిజస్వరూపం నలుగురితోనూ చెపుతారని అతడి భయం.

బానిసలతోపాటు తెడ్డువేస్తున్న పింగళుడు తను మరిచిపోయిన భల్లూకకేతుడి మంత్రం గుర్తుచేసుకునేందుకు ఎంతగానో ప్రయత్నించాడు. కాని అతడికి ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా అది గుర్తుకు రాలేదు. తన అన్నలు తన ఆస్తికోసం తనను యింత కుటిలంగా ఓడసరంగుకు బానిసగా అమ్మారని తెలుసుకుని పింగళుడు మండిపోయాడు. ఇక యిప్పుడు తన అడ్డు లేదు కనక తల్లిని వాళ్ళు పూర్వంలాగే నానా హింసలూ పెడతారనీ, తను సంపాయించుకు వచ్చిన ధనాన్ని దుబారాఖర్చులకు వినియోగిస్తారనీ అతడు గ్రహించాడు.



ఈ బానిస జీవితాన్నుంచి తను బయట పడటం ఎలా ? పింగళుడికి రేబవళ్లు యిదే ఆలోచన. అనుకోని విధంగా—దైవ సంకల్పమా అన్నట్టు ఒకానొక రోజున సముద్రంమీద పెనుతుఫాను ప్రారంభ మయింది. సముద్రంలో ఉవ్వెత్తుగా లేచిన అలలకూ, పెనుగాలి తాకిడికీ ఓడ సుడి గాలిలో ఎండుటాకులా అల్లల్లాడ సాగింది. సరంగు ప్రమాదం గుర్తించి తన అను చరులకూ, బానిసలకూ హెచ్చరికలూ, అజ్ఞలూ యిస్తూ ఓడంతా కలయతిరుగు తున్నాడు. అదే సమయంలో అతడి పాలిటి మిత్తి పంపినదా అన్నట్టు, దూరంలో మరొక ఓడ తుఫానులో చిక్కి, సముద్రపు అలల మీద అటూయిటూ దొర్లుతూ కనిపించింది.

సరంగు తనవద్ద గల దుర్భిణీలోంచి ఆ ఓడను పరీకించి చూశాడు. అది చాలా పెద్దఓడ. ఖండాంతర వ్యాపారాలకుగాను, పెద్దపెద్ద వర్తకులు వుపయోగించే కోవకు చెందింది. అలాంటి ఓడలో వెలలేని వర్తక సరుకులు వుంటవని సరంగుకు తెలుసు.

సముద్రం మధ్యన రెండు ఓడలు పెను తుఫానులో చిక్కి ప్రమాదావస్థలో వున్నవి. నావికులు ఓడలను రకించుకునేందుకు తమ యావచ్ఛక్తినీ వినియోగిస్తున్నారు. ఇలాంటి అదనులో తను కొంత సాహసించి,





ఆ ఓడను ముట్టడిస్తే, తప్పక అందులోగల అమూల్యమైన వర్తకసామానులన్నీ తనవి అవుతవని సరంగుకు దురాశ కలిగింది. తన అనుచరులా; యిలాంటి గడ్డుపరిస్థితులకు అలవాటు పడినవాళ్ళు. ఇక ఆ వర్తక ఓడలో వున్న నావికులు సముద్రయానానికి అవసరం అయిన నావికాపరిజ్ఞానం వున్న వారే తప్ప. సముద్రయుద్ధానికి అలవాటు పడినవాళ్ళయి వుండరు.

సరంగు యీ విధంగా ఆలోచించి, తన అనుచరులను హెచ్చరించాడు. అంత తుపానులోనూ అతడి అనుచరులు కత్తులూ, విల్లమ్ములూ ధరించి ఆ వర్తక ఓడను వశ పరుచుకునేందుకు సన్నద్ధమయారు.

పింగళుడు, మిగతా బానిసలతోపాటు వున్న శక్తినంతా వినియోగించి తెడ్డు వేస్తున్నాడు. క్రమంగా ఓడ ఆ వర్తకపు ఓడను సమీపిస్తోంది. సరంగు తన ముఖ్యాను చరులతో తెరచాపకొయ్యకు అనుకునిలబడి, దుర్భిణిలోంచి వర్తకపు ఓడకేసి చూస్తు న్నాడు. హఠాత్తుగా అతడు భయకంపిత మైన స్వరంతో కీచుమంటూ అరిచాడు.

"అందరూ విల్లంబులు ఎక్కుపెట్టి వద లండి! ఓడను వెనక్కు నడపండి! అది వర్తకపు ఓడలా లేదు. వాళ్ళు మండు తున్న గుడ్డలను బాణాలకు చుట్టి మన ఓడ మీదికి వదలబోతున్నారు!"

సరంగు మాట ముగించీ ముగించక ముందే, అవతలి ఓడలోంచి మండుతూన్న బాణాలు తారాజువ్వల్లా ఎగిరివచ్చి, పింగళు డున్న ఓడమీద పడసాగినై. వాటిలో కొన్ని తెరచాప స్తంభానికి అనుకు నిలబడిన సరంగు అనుచరులమీద పడి, వాళ్ల గుడ్డలు భగ్గుమని మండినై. వెంటనే సరంగు పిచ్చి వాడిలా గంతులేస్తూ "బానిస లందర్నీ వదలండి. వాళ్లు తెడ్లు వదిలి, కత్తులు పట్టి ఓడను రక్షించవలసిన సమయం వచ్చింది," అంటూ కేకలుపెట్టాడు. —(ఇంకావుంది)





# అలీబాబా

ఇరానులోని ఒక నగరంలో ఇద్ద రన్నదమ్ములుండేవారు. ఒకడి పేరు కాసిమ్. రెండోవాడి పేరు అలీబాబా. వారికి తండ్రి కొద్దిపాటి ఆస్తిని సమంగా పంచిపోయాడు. కాసిమ్ ధనవంతుల పిల్లను పెళ్ళాడి, వర్తకం చేసి తానుకూడా ధనికుడయాడు. అలీబాబా పేద ఇంటిపిల్లను పెళ్ళాడి, కట్టెలమ్ముకుని జీవించసాగాడు. అతను రోజూ అడివికి వెళ్లి, కట్టెలు కొట్టి, వాటిని తన మూడు గాడిదలపైనా వేసి పట్టణానికి పోయి, అక్కడ అమ్మేవాడు.

ఒకనాడు అలీబాబా అడవిలో కట్టెలు కొట్టేసమయంలో అతనికి దూరాన దుమ్ము రేగటం కనిపించింది. ఆ దుమ్ము అంతకంతకూ దగ్గిరకి రాసాగింది. అతను మరి కొంచెం పరిశీలనగా చూసి, కొంతమంది మనుషులు గుర్రాలెక్కి వస్తున్నట్టు గ్రహించాడు. వారు దొంగలై వుండవచ్చునని అతనికి తోచింది. తన గాడిదలు ఏమైనప్పటికీ, తన ప్రాణం దక్కించుకుందామనుకుని, ఎత్తుగా గుట్టమీద వున్న పెద్ద చెట్టెక్కి, దట్టంగా ఆకులుగల కొమ్మలమధ్య దాగి, తాను ఎవరికీ కనబడకుండా, కింద నడిచేదంతా గమనించసాగాడు.

త్వరలోనే ఆశ్వికులు అదే గుట్టను చేరుకుని గుర్రాలు దిగారు. వారు నలభైమంది వున్నారు. వారందరూ తమ గుర్రాలను కట్టేసి, వాటి మూతులకు దాణాసంచులు తగిలించి, జీనులనుంచి బరువైన సంచులు విప్పి చేతపట్టుకున్నారు. ఆ సంచులలో వెండి బంగారాలవంటి బరువైన సరుకులున్నట్టు అలీబాబాకు తోచింది.

ఆ నలభైమందిలోనూ ఒకడు నాయకుడులాగా కనిపించాడు. వాడు పొదల మధ్యగా నడిచి గుట్టను సమీపించి, "తలుపు తెరు, నువ్వులూ!" అన్నాడు. వాడామాట అన

ఆర్. సూర్యనారాయణ



గానే రాతిలో ఒక తలుపులాటిది తెరుచుకున్నది. మిగిలినవాళ్లందరూ ఆ ద్వారంలో నుంచి లోపలికి వెళ్ళాక దొంగల నాయకుడు తానుకూడా వెళ్ళాడు. తరవాత రాయి ఎప్పటిలాగా మూసుకున్నది.

అలీబాబాకు చాలా భయంవేసింది. అతను చెట్టుమీదనుంచి దిగనేలేదు. కొంత సేపు గడిచాక రాతితలుపు మళ్ళీ తెరుచుకుని దొంగలనాయకుడు బయటికి వచ్చాడు. మిగిలినవారి నందరినీ బయటికి రానిచ్చి, "తలుపు ముయ్యి, నువ్వులా!" అన్నాడు. వెంటనే రాయి మూసుకున్నది. అందరూ తమతమ గుర్రాలను విప్పి, వాటిమీద ఎక్కారు. నాయకుడు ముందు కదిలాడు, అతనివెనక మిగిలిన ముప్పైతొమ్మిదిమంది దొంగలూ కదిలారు.

ఇదంతా అలీబాబా చెట్టుపైనుంచి చూశాడు. దొంగలు కనుచూపుమేర దాటి పోయిన చాలాసేపటివరకూ అతను చెట్టు పైనే వుండి ఆ తరవాత దిగాడు. దొంగల నాయకుడు అన్న మాటలే అంటే తనకు కూడా ద్వారం తెరుచుకుంటుందేమో చూడాలని అతనికి కుతూహలం కలిగింది. అందుచేత అతనుకూడా పొదల మధ్యగా వెళ్ళి రాతితలుపు వుండేచోట నిలబడి, "తలుపు తియ్యి, నువ్వులా!" అన్నాడు. వెంటనే గభీమని తలుపు తెరుచుకున్నది.

లోపల గుహలాగా చీకటిగా వుంటుందని అలీబాబా అనుకున్నాడు, కాని అతనికి ఒక కాంతివంతమైన, విశాలమైన గది కనిపించింది. పైనుంచి గదిలోకి వెలుతురు వస్తున్నది. గదినిండా రకరకాల వస్తువులూ, పట్టుతానుల బేళ్ళూ, జరీబట్టలూ, ఎత్తుగా పేర్చిన రత్నకంబళాలూ, వెండి బంగారు కణికల పోగులూ, ధనపు సంచులూ వున్నాయి. ఇదంతా చూసి, ఎన్నితరాలుగానో దొంగలు ఇక్కడ వుంటూ వుండివుండాలని అలీబాబా తెలుసుకున్నాడు.





అతను ధైర్యంచేసి లోపలికి వెళ్ళి తన మూడు గాడిదలూ మోయగలిగినంత బంగారం సంచులు తీసుకున్నాడు. వాటిని గాడిదలమీదకెత్తి, అవి చూసేవారి కంట పడకుండా వాటిపైన కట్టెలు పేర్చాడు. చివర కతను బయటికి వచ్చి, "తలుపు ముయ్యి, నువ్వులూ!" అన్నాడు. వెంటనే తలుపు మూసుకున్నది.

అలీబాబా తన గాడిదలను తోలుకుని నేరుగా ఇంటికి వెళ్ళాడు. గాడిదలను దొడ్లోకి తోలి, తలవాకిలి తలుపు గడియపెట్టి, కట్టెలు తీసేసి సంచులను ఇంట్లోకి తీసుకు పోయి, వాటిని భార్యఎదట బారుగా పెట్టాడు. అతను ఆ సంచులలోని బంగారాన్ని కుమ్మ రించేసరికి అతనిభార్య కళ్లుచెదరిపోయాయి. అతను ఆమెతో జరిగినదంతా చెప్పి, ఈ విషయం పురుగుకైనా తెలియనీయవద్దని హెచ్చరించాడు. అతనిభార్య ఆనందానికి మేరలేదు. భర్త తెచ్చిన బంగారునాణాలన్నీ లెక్క పెడతానని ఆమె అన్నది. "ఓసీ, వీటిని లెక్కించటానికి నీ ఆయువు చాలదు. మనకా వ్యవధిలేదు. వీటిని భద్రంగా ఎక్కడైనా పాతిపెట్టాలి," అన్నాడు.

"నువు చెప్పినది నిజమే. కాని కాస్త అటూ ఇటూగా ఎంత బంగారం ఉన్నదో తెలియాలి. కనీసం దీన్ని కొలత వేద్దాం. నువు గుంటతవ్వేలోగా నేను ఒక సోల తెస్తాను," అన్నది భార్య. ఆమె తన బావ గారైన కాసిమ్ ఇంటికి వెళ్లి తన తోడి కోడలితో, "ఒక సోల వుంటే ఇస్తావా? ఇప్పుడే తెచ్చిఇస్తాను," అన్నది.

కాసిమ్ భార్య సరేనన్నది. తన మరిది ఇంట్లో ఏం ధాన్యం వండుకుంటున్నారో తెలుసుకునే వుద్దేశంతో ఆమె సోలలోపల అడుగున గోదు అంటించి సోల తెచ్చి తన తోడికోడలి కిచ్చింది. అలీబాబా భార్య ఇంటికి వచ్చి తన భర్త తెచ్చిన బంగారం ఎన్నిసోలలున్నది లెక్కచూసి, తరవాత

తన భర్తవద్దకు వెళ్ళి, "గుంట తవ్వటం అయిందా ?" అన్నది.

అలీబాబా గుంట తవ్వటం ముగించాడు. భార్యాభర్తలిద్దరూ కలిసి బంగారాన్ని ఆ గుంటలో పెట్టి పూడ్చారు.

తరవాత అలీబాబా భార్య అన్నమాట ప్రకారం సోలను తీసుకుపోయి తన తోడి కోడలికిచ్చేసింది. ఆ సోల అడుగున ఒక బంగారునాణెం అంటుకున్న సంగతి ఆమె గమనించనేలేదు. "పనికాగానే నీ సోల తెచ్చి నీకిచ్చానమ్మోయ్!" అని హెచ్చరించి ఆమె తన తోడికోడలువద్ద సెలవుతీసుకుని ఇంటికి వెళ్ళిపోయింది.

కాసిమ్ భార్య సోలలోపల చూసేసరికి బంగారునాణెం కనిపించింది. ఆమె ఒక్క క్షణంపాటు దిమ్మరపోయి, "ఏమిటీ? అలీబాబా బంగారాన్ని సోలలతో కొలిచేటంత భాగ్యవంతుడైనాడుగా? ఇంత సిరి ఇంత అకస్మాత్తుగా ఎట్లా ఎత్తుకున్నదబ్బా!" అనుకున్నదావిడ, అసూయతో నిలువునా దహించుకుపోతూ.

ఇదంతా జరిగే సమయానికి కాసిమ్ తన దుకాణంనుంచి ఇంకా తిరిగి రాలేదు. కాని ఆయన రాగానే ఆయన భార్య, "నువు చాలా ధనికుణ్ణని అనుకుంటున్నావు గామాలు! నీ తమ్ముడు అలీబాబా నీకన్న



వెయ్యిరెట్లు ధనికుడు! ఆసంగతి తెలుసుకో. అతనిదగ్గిర ఎంత బంగారం వున్నదంటే దాన్ని లెక్కపెట్టటానికి సాధ్యంకాక, సోలలతో కొలిసి చూసుకుంటున్నాడు, ఏమనుకున్నావో!" అన్నది.

"ఏమిటి నువ్వనేది? నాకేమీ అర్థం కావటంలేదు," అన్నాడు కాసిం. అప్పుడాయన భార్య జరిగినదంతా చెప్పి, తాను అరువిచ్చిన సోలఅడుగున అంటుకున్న బంగారునాణెంతీసి చూపింది. అది అతి ప్రాచీనమైన నాణెం. ఏరాజు కాలంలో ముద్ర వేసినదోకూడా కాసిం ఎంత పరీక్షించినా తెలుసుకోలేకపోయాడు.

కాసిం డబ్బుగల వితంతువును పెళ్ళాడిన నాటినుంచీ తన తమ్ముణ్ణి పరాయి వాడల్లేనే చూస్తూవచ్చాడు. ఇంత కాలానికి అలీబాబా ధనం సంపాదించుకుంటే కాసిం సంతోషించటానికి బదులుగా అసూయతో కుంగిపోయాడు. ఆ రాత్రల్లా ఆయనకు నిద్రపట్టలేదు. మర్నాడు తెల్లవారుతూనే ఆయన అలీబాబా ఇంటికి వెళ్ళి, "అలీబాబా, నీ ధోరణి నాకేమీ నచ్చలేదు. నువు ఒకవంక అతి పేదవాడిలాగా బతుకుతూ చాటుగా బంగారం కొలుస్తున్నావుట. నిన్న నీ భార్యకు నా భార్య అరువిచ్చిన సోలఅడుగున ఈ బంగారునాణెం అంటుకున్నది," అన్నాడు.





ఈ మాటలు వినగానే అలీబాబా కుంగి పోయాడు. తాను ఏదైతే పరమరహస్యంగా ఉంచుదామనుకున్నాడో అది కాస్తా తన భార్య చేసిన పొరపాటువల్ల తన అన్నకూ, వదినెకూ తెలిసిపోయింది! అయితే అలీ బాబా పైకి ఆశ్చర్యంగాని, భయంగాని కన బరచక, జరిగినదంతా చెప్పి, "ఈ విషయం రహస్యంగా ఉంచావంటే నేను తెచ్చిన బంగారంలో నీకూ్కడా భాగం ఇస్తాను!" అన్నాడు అన్నతో.

"భాగం ఎవడికోసం ఇస్తావు! నేనడి గేది అదికాదు. ఈ గుహ ఎక్కడున్నదీ, అక్కడికి దారి ఏమిటో నాకు స్పష్టంగా తెలియాలి. అవసరమైనప్పుడల్లా నేనుకూడా వెళ్ళి అక్కణ్ణుంచి సొమ్ము తెచ్చుకుంటాను మరి!" అన్నాడు కాసిం.

గత్యంతరం లేక అలీబాబా అన్న కోరిన దంతా చెప్పేశాడు; తలుపు తెరవటానికీ, మూయటానికీ అనవలిసిన మాటలుకూడా ఆయనకు చెప్పాడు.

కాసిం మర్నాడుదయం తూర్పుతెల్లారక మునుపేలేచి, పది కంచరగాడిదలమీద పెద్ద పెద్ద కావడిపెట్టెలు వేసుకుని, అలీ బాబా చెప్పిన మార్గాన అడివికి వెళ్లాడు. అలీబాబా ఎక్కిన చెట్టూ, పొదలూ, గుట్టా, అన్నీ ఆయన పోల్చుకుని రాతిద్వారం చేరు కున్నాడు. "తలుపు తెరు, నువ్వులూ!" అనగానే ద్వారం తెరుచుకున్నది. కాసిం లోపలికి వెళ్ళగానే తలుపు మూసుకున్నది.

లోపల ఉండే ధనరాసులు చూసి కాసిం తన్మయుడైపోయాడు. అలీబాబా చెప్పిన మాటలనుబట్టి ఆయన ఇంత ధనం ఉంటుందనుకోలేదు. ఆయన మనసు పూర్తిగా డబ్బుమీదనే లగ్నమయింది. ఆయన తాను తీసుకుపోదలచిన సంచు లన్నీ తెచ్చి వాకిలిదగ్గిర పేర్చిపెట్టాడు. అయితే ఈ ధనమంతా తన యింటికి చేర్చటంలో తన్మయత్వం చెందిన కాసిం

తలుపు తెరిచే మంత్రం కాస్తా మరిచిపోయి, "తలుపు తెరు, నువ్వులూ!" అనటానికి మారుగా, "తలుపు తెరు, మెంతులూ!" అన్నాడు. తలుపు తెరుచుకోలేదు. కాసిం దిగ్భ్రమచెందాడు. కంగారులో అతను మిరియాలనూ, ధనియాలనూ ఇంకేవేవో ధాన్యాలను జ్ఞాపకం తెచ్చుకున్నాడుగాని, వాటివల్ల కాస్తయినా ప్రయోజనం లేక పోయింది.

వ్యవహారం ఇలా విషమిస్తుందని కాసిం కలలోకూడా అనుకోలేదు. తాను ప్రమా దంలో చిక్కుకున్నట్టు ఆయనకు అర్థ మయింది. తాను పేర్చిపెట్టిన సంచులను కాలితో తన్ని అటూ ఇటూ పచార్లు చేయ సాగాడు. ఇప్పుడాయనకు ఆ గదిలో ఉన్న అంత గొప్ప సంపద ఏమాత్రమూ ఆకర్ష వంతంగా కనపడలేదు.

మిట్టమధ్యాన్నంవేళ దొంగలు అక్కడికి వచ్చారు. దూరాన ఉండగానే వారికి గుట్ట వద్ద కాసిం తెచ్చిన కంచరగాడిదలు కని పించాయి. వాటిమీద ఉన్న కావడిపెట్టె లనుకూడా దొంగలు చూశారు. ఇది చూడ గానే వారికి కంగారు పుట్టింది. వారు తమ గుర్రాలను మరింత వేగంగా తోలి గుట్టను చేరుకున్నారు. వారు కంచరగాడిదలను



అడివిలోకి తరిమేసి, కత్తులు దూసి, మంత్రం చదివి తలుపు తెరిచి, లోపలికి వెళ్లారు.

ఈలోపుగా కాసిం గుర్రాల డెక్కల చప్పుడు విని దొంగలు వచ్చినట్టు గ్రహిం చాడు. ఆయన బయటికి పారిపోవటానికి సిద్ధంగా ఉండి, తలుపు తెరుచుకోగానే పరి గెత్తుతూ వచ్చి దొంగల నాయకుణ్ణి ఒక్క తోపుతో కింద పడేశాడు. అయితే మిగిలిన దొంగలు ఆయనను పట్టుకుని కత్తులతో పొడిచి చంపేశారు.

తరవాత వారు తమ గుహ అంతా పరీ క్షించుకున్నారు. కాసిం వాకిలిదగ్గిర పెట్టిన సంచులను వారు యథాస్థానంలో పెట్టేశారు.

అలీబాబా తీసుకుపోయిన బంగారం అచోకీ కూడా వారికి తెలిసింది. కాసిం లోపలికి ఎలా రాగలిగాడో, తమకు తెలిసిన మంత్రం పైవాళ్ళకు ఎలా తెలిసిందో వారు ఊహించ లేకపోయారు. ఈ మంత్రం తెలిసినవా రింకెవరైనా ఉంటే వాళ్ళని హడలగొట్టే టందుకుగాను దొంగలు కాసిం శరీరాన్ని నాలుగు ముక్కలుగా నరికి గుహలోపల ద్వారానికి రెండువైపులా రెండేసి ముక్కలు వేళ్లాడగట్టారు. తరవాత వారు మళ్లీ తలుపు యథాప్రకారం మూసి, తమ గుర్రాలెక్కి, దార్లు కాయటానికీ, బిడార్లను దోయటానికీ బయలుదేరి వెళ్లారు.

రాత్రి అయింది. కాసిం ఇంటికి తిరిగి రాలేదు. ఆయన భార్య ఆందోళనపడుతూ అలీబాబా ఇంటికి వెళ్లి, "మరిదీ, మీ అన్నయ్య అడివికి ఎందుకై వెళ్లారో నీకు తెలిసే వుంటుంది. చీకటి పడింది, ఇంత వరకూ ఆయన తిరిగి రాలేదు. ఆయనకు ఏమి ఆపద కలిగిందో అని నాకు భయంగా ఉన్నది!" అన్నది.

"ఇంతమాత్రానికే నువు భయపడ నవ సరంలేదు, వదినా. ఊరు మాటుమణగక ముందు అన్నయ్య రాకపోవచ్చు," అన్నాడు అలీబాబా. కాసిం వెళ్ళిన పని చాలా రహస్య మైనది గనక అలీబాబా చెప్పిన మాటలు



కాసింభార్యకు సబబుగానే తోచాయి. ఆవిడ ఇంటికి తిరిగి వెళ్లి అర్ధరాత్రిదాకా ఓర్పుగా వేచివున్నది. కాని ఆ తరవాత ఆవిడ అనుమానాలు రెట్టింపు అయాయి. పైకి ఏడవటానికికూడా వీలులేకపోవటంచేత భర్తకోసం లోలోపల కుళ్లి ఏడవసాగింది. తన మరది వ్యవహారంలో జోక్యం కలిగించుకున్నందు కావిడ తనను తాను తిట్టుకున్నది. ఆవిడ తెల్లవార్లూ ఏడిచి, వాచిపోయిన కళ్లతో అలీబాబా ఇంటికి వెళ్లింది. ఆవిడను చూడగానే ఆవిడ రాకకు కారణమేమిటో అలీబాబాకు తెలిసిపోయింది. తన అన్నకు ఏదోప్రమాదం జరిగివుంటుందని అతడికి భయంకలిగింది.

ఆవిడ అడగకముందే అలీబాబా తన మూడు గాడిదలనూ సిద్ధం చేసుకుని అడివికి బయలుదేరాడు. వెళ్లేటప్పుడతను తన వదినెగారిని ధైర్యంగా ఉండమని చెప్పాడు. దారిలో అతనికి అన్న జాడగానీ ఆయన కంచరగాడిదల జాడగానీ తగలలేదు. దానికి తగ్గట్టుగా గుట్టవద్ద నెత్తురు మరకలు కనిపించాయి. అలీబాబా గుండె జల్లుమన్నది. అయితే అతను మంత్రం చదివి లోపలికి అడుగుపెట్టి తన అన్న శవంతాలూకు ముకల్కు చూసేసరికి నిలువునా నీరైపోయాడు. తన అన్న తనపట్ల సోదరప్రేమ చూపనప్పటికీ, అలీబాబా ఆ అన్నకు సోదర





విధి నిర్వర్తించ నిశ్చయించాడు. అతను తన అన్న శవాన్ని ఒక గాడిదమీద వేసి దాన్ని కట్టెలతో కప్పాడు. తరవాత మరికొన్ని బంగారం సంచులు తీసి మిగిలిన రెండు గాడిదలమీద వేసి, వాటినికూడా కట్టెలతో కప్పి, తలుపు ఎప్పటిలాగా మూసి ఇంటి దారి పట్టాడు. అతను వెలుతురుండగా అడవిదాటి రాక, అడవి చివర కొంతసేపు ఆగి బాగా చీకటి పడ్డాకనే ఊళ్లో ప్రవేశించాడు. ధనపు సంచులు గల రెండు గాడిదలనూ తన ఆవరణలోకి తోలి, సరుకు దించుకోమని తన భార్యను హెచ్చరించి, మూడో గాడిదను తోలుకుని సరాసరి తన అన్న ఇంటికి వెళ్లి తలవాకిలి తలుపు తట్టాడు.

మోర్జియానా అనే బానిసపిల్ల తలుపు తెరిచింది. ఈమె కాసిం ఇంటో వుండే బానిస. చాలా తెలివీ, చాకచక్యమూ గలది, ఎటువంటి చిక్కులోనైనా సమయస్ఫూర్తితో నడుచుకోగలది. ఆమెతో అలీబాబా, "ఓసీ, ఇది పరమ రహస్యం. ఈ గాడిదమీద వున్నది నీ యజమాని శవం. ఆయన జబ్బు చేసి సహజమైన చావు చచ్చినట్టు మనం లోకాన్ని నమ్మించాలి. తరవాత ఆయనకు ఉత్తరక్రియలు జరిపించాలి. ఇదంతా ఎలా చేస్తావో, నీదే భారం. వెళ్లు, నీ యజమానురాలికి అంతా చెప్పు!" అన్నాడు. అతను తన అన్న శవాన్ని ఇంట్లో పెట్టించి, జరగవలసినది యుక్తిగా జరిపించమని మోర్జియానాను మళ్లీ హెచ్చరించి, తన గాడిదను తోలుకుని ఇంటికి వెళ్లిపోయాడు.

మర్నాడు ఉదయమే మోర్జియానా ఒక మందుల దుకాణానికి వెళ్లి, "కాస్త నాభి ఇవ్వండి!" అని అడిగింది. "ఎవరికి?" అని అడిగాడు మందులు చేసేవాడు. "మా యజమాని కాసింగారికి చాలా బరువుగా ఉంది. ఆయన గుటక వెయ్యటంలేదు. మాట్లాడటంలేదు!" అన్నది మోర్జియానా

ఆమె ఆ సాయంకాలం మళ్లీ వచ్చి, "కాస్త గరళం వుంటే ఇప్పించండి. ఇదికూడా పని చేస్తుందని ఏమీ నమ్మకంలేదు!" అన్నది ఏడుపుగొంతు పెట్టి.

ఆరోజు అలీబాబా తన భార్యతోసహా రెండు మూడుసార్లు తన అన్నగారి ఇంటికి వెళ్లిరావటమూ, వారి ముఖాలు విచారంగా ఉండటమూ చూసి, కాసింకు చాలా జబ్బు చేసిందని అందరూ సులువుగా నమ్మారు. అందుచేత, ఆ సాయంకాలం కాసిం ఇంట ఏడుపులు సాగగానే అంతా అయిపోయిందనుకున్నారు. మోర్జియానా అందరితోటీ తన యజమాని చనిపోయినట్టు చెప్పిందికూడా.

మర్నాడు తెల్లవారుతూనే మోర్జియానా ముస్తఫా అనే తోళ్లు కుట్టే ముసలివాడి దుకాణానికి వెళ్లింది. వాడు తూర్పు తెల్ల వారకముందే దుకాణం తెరుస్తాడని ఆమెకు తెలుసు. ఆమె ముసలివాడి చేతులో ఒక బంగారు దీనారం పెట్టి, "బాబా ముస్తఫా, నువు నీ కుట్టుపరికరాలు తీసుకుని నావెంట రావాలి. ముందే చెబుతున్నాను, నేను నిన్ను తీసుకుపోయే చోటు చాలా రహస్యం. అందుచేత మధ్యదారిలో నీ కళ్లకు గంతలు కడతాను!" అన్నది. ముసలివాడు అనుమానిస్తూ, మోర్జియానా కేసి కొంచెంసేపు చూసి,



"ఓహో, నాచేత కూడనిపని ఏదో చేయించేటట్టున్నావే!" అన్నాడు.

"ప్రమాణపూర్తిగా అలాటిదేమీ లేదు. నావెంట రా, నీకేమీ భయంలేదు," అన్నది మోర్జియానా.

బాబాముస్తఫా ఆమెవెంట బయలు దేరాడు. మధ్యదారిలో ఆమె అన్నప్రకారం ముసలాడి కళ్లకు గంతలు కట్టింది. తరవాత ఆయనను తన యజమాని ఇంటికి తీసుకుపోయి, శవం వున్న గది చేరినదాకా అతడి కళ్లగంతలు విప్పలేదు.

"బాబాముస్తఫా, ఈ శవాన్ని త్వరగా కుట్టేసినట్టయితే నీకింకొక బంగారు దీనారం

ఇస్తాను,'' అన్నదామె. ముస్తఫా గబగబా తన పని ముగించి, రెండో దీనారం పుచ్చుకుని, కళ్లకు మళ్లీ గంతలు కట్టించుకుని ఆమె వెంట బయలుదేరాడు. ఎక్కడైతే ముందు గంతలు కట్టిందో అక్కడికి రాగానే ఆమె ముసలాడి గంతలు విప్పేసి, ఇంటికి వెళ్లిపొమ్మన్నది. ముసలాడు తనను వెంబడించకుండా చూసుకుని ఆమె ఇంటికి తిరిగివచ్చింది.

ఇంటికి తిరిగి వస్తూనే మోర్జియానా తన యజమాని శరీరానికి స్నానంచేయించింది. అలీబాబా గుగ్గిలం పొగవేశాడు. తరవాత శవానికి ఆచారంరీత్యా వెయ్యవలిసిన దుస్తులువేశాడు. త్వరలోనే మసీదునుంచి ధర్మకర్తలు వచ్చారు. ఉత్తరక్రియలు జరిపించటానికి ఇమాం వచ్చాడు. ఇమాం మంత్రాలు చదువుతూ ముందునడుస్తూంటే నలుగురు గృహస్థులు శవాన్ని శ్మశానానికి మోసుకువెళ్ళారు. మోర్జియానా మాత్రమే గుండెలు బాదుకుని ఏడుస్తూ శవంవెంట వెళ్ళింది. కాసిం భార్య ఇంటివద్ద ఇరుగు పొరుగు ఆడవాళ్ళమధ్య కూచుని భర్తకోసం శోకాలుపెట్టింది.

ఈ విధంగా కాసిం దుర్మరణం కప్పిపుచ్చబడింది. ఆయన చావు రహస్యం తెలిసినది అలీబాబాకూ, మోర్జియానాకూ, కాసిం భార్యకూ మాత్రమే. ఉత్తరక్రియలు జరిగిన మూడునాలుగు రోజుల అనంతరం అలీబాబా తనకున్న కొద్ది సామానుతోసహా తన అన్నగారి ఇంటికి మారాడు. ఇక ముందు అతను అన్నగారి ఇంటనే వుండేటట్టు ఏర్పాటు జరిగింది. తాను దొంగల గుహనుంచి తెచ్చి పాతిపెట్టిన బంగారాన్ని మటుకు అలీబాబా రాత్రివేళ రహస్యంగా కొత్తయింటికి చేరవేశాడు.

కాసిం చాలాకాలంగా నడుపుతూవచ్చిన దుకాణాన్ని ఇప్పుడు అలీబాబా పెద్దకొడుకు చూడసాగాడు. —(ఇంకా వుంది)






ఒకనాడు కాకి యెం-తో దుఃఖపడుచు
ఇక నుండలేనంచు - నెలుకతో ననియె :
మనసు విరక్తమై - మఱుగుచునుండె
నను గన్న ఈ నేల - నలుగుచునుండె.
వానలే లేవయ్యె - వఱపు వచ్చినది
ఈ నరుల్ బలు లిచ్చు-టే మానినారు.
గింజ గిట్టయు లేక - గిలగిలలాడి
గంజికి లేక ఇ-క్కడివార లెల్ల
వలలతో పక్షుల - బట్టగా దివిరి
బలగమ్ముతో వచ్చి - పడుచున్నవారు.
వలలోన నే బడి - ఇల నూకలుంట
వలన తప్పించుక - వచ్చినవాడ.
ఇకమీద నిట నుండ - నిష్టములేదు
చకచక యెటకైన - చనియెద నింక.

హిరణ్యకం :

పయన మెక్కడికయ్య? - పయనింతుగాని
బయలునుగూర్చి ఏ-పగిది పోయెదవు?

లఘుపతనకం :

కలదు దక్షిణమున - కాన యొక్కండు
కల దందులో పెద్ద - కాసార మొకటి.
అందు మంథరక మ-న్నట్టి తాబేలు
ఎందున నిను బోలు - నెంతొ స్నేహమున.
అ మిత్రు డెదియైన - నాహార మిచ్చు
అ మాట యీ మాట - నాడుచునుండు.
అట కేగి నివసింప - హాయిగా నుండు
ఇట వలలో పడి - యేడ్చుటలేల?
కఱవు వచ్చినచోట - కాలూనరాదు
పెఱ నేల తన నేల - పెద్దలకేల?
బలమున్నవానికి - బరువేది కలదు?
తలపున్నవానికి - దవ్వేది కలదు?
పాండిత్యమున్నచో - పరదేశ మేది?
దండి నోరున్నచో - నుండునా పరుడు?

హిరణ్యకం :

నీ వేగుచో సరే - నేనును వత్తు
నీవు లే కిటనుండి - నేనేమి సేతు?

విద్వాన్ విశ్వం



లఘుపతనకం :

నా మనసన్నచో - నవయుచునుండె
నీ మాడ్కి నీవు నా-తో మనుటేల?
ఇంతకు పైపైన - నేగుదు నేను
అంతదూరము పరు - వందుకోగలవ?

హిరణ్యకం :

నన్ను పైనెక్కించు-కొన్నచో పత్తు
నిన్ను వీడగలేను - నేస్తుడా నేను.

లఘుపతనకం :

సంతోష మటులైన - చింతయే లేదు
ఎంతైన యెగురుట - కేను వలంతి.
రివ్వున నెగురగా - దవ్వుల దిగగ
నవ్వుల గిరగిర - నాట్యమ్ము సేయ
అడ్డుగా పోవగా - నటునిటు దిరుగ
ఒడ్డు జేర్పగ జాలు - నోపిక గలదు.

* * *

అని కాకి యెలుకను - తనపైన నిల్పు
కొని తిన్నగా సర-స్సును చేరుకొనియె
అది యేదొ సామాన్య-మగు కాకి యనుచు
పదిలమ్ముగా చూచి-నది కూర్మ మంత
దీనితో నేమని - తాను, సరస్సు
లోనికి చనె గబా-లున భయమంది.
కాకి యెల్కను చెట్టు - కడ దింపివేసి
అ కొమ్మపై నెక్కి - అఱచిన దిట్లు :

లఘుపతనకం :

ఓ మంథరక పైని - కొక్కింత రమ్ము
నీ మిత్రుడను చూడ - నిటు వచ్చినాడ.
తడి కప్పురంపు గం-దపు పూతలేల
పడి మిత్రు నొడిలోన - వాలిన చాలు !

* * *

ఆ మాట విన్నంత - నతని గుర్తించి
అ మంథరకము బ-యల్పడి వచ్చి
రమ్ము రమ్మని కౌగి - లిమ్మని యడిగె
కమ్మని కౌగిట - గలిసిరి వారు.
అ మాట ఈ మాట-లాడిన పిదప
" ఈ మూషికమ్ము నీ - వేల తెచ్చితివి
తినుతిండి గద నీకు - తినకుండ పైన
కొనివచ్చితేల యం"-చును పృచ్ఛచేయు



తాబేలు కన్గొని - తడయక కాకి
"ఈ బేల యెలుక నా - కెంతేని నేస్తు
మనసున దిగులుతో - మఱుగుచువచ్చె"
నన మూషికము తన - వనటను చెప్పె.

హిరణ్యకం :

నేస్తులారా దిగుల్ - మస్తుగా కలదు
వాస్తవ కథ నెల్ల - వర్ణింతు వినుడు :
అటు దక్షిణాది నొ-క్కటి పట్టణమ్ము
అట ఊరిబయట దే-వాలయమ్ముండు.
చండీ మఠమ్ములో - సన్యాసి యొకడు
ఉండును తామ్రచూ-డుం డనువాడు.
పురమున కేగి యే-పూట కాపూట
సరి భిక్షమెత్తుక - చయ్యన వచ్చి
తిని కొంత, మిగిలిన-దెల్ల పాత్రమున
నునిచి గుంజకు వేసి - యుంచు నాతండు
మరునాడు దానిని - పరిజనమ్ములకు
మరియిచ్చి పనిపాట - సరిచేయమనును.
ఇటులుండనా భృత్యు - లిది పరికించి
ఎటులైన ఆ తిండి - గుటకవేయంగ
తలచి నాతో చెప్ప-తల యూచి వెళ్ళి
చిలుకున నున్నట్టి - చిఱుతిండి నెల్ల
తిని భృత్యులకు నిచ్చి - చనుచుంటి రోజు
అనుదినకృత్యమే - యయ్యె నా తీరు.
పాపమా సన్యాసి - పలుమాఱు చూచి
ఓపికతో వెదు - రొక్కటి తెచ్చి
ఎలుకల సవ్వడి - యేమాత్రమైన
పలికించు వెదురును - పటపట కొట్టి.
కొట్టినప్పుడు తటు-క్కున వెళ్ళిపోయి
ఇట్టెవచ్చుచు వాని - నేడ్పించుచుంటి.
ఇటులుండ నొక్కనా - డింకొక జోగి
అట వచ్చి విడిసె, ఆ-యయ్యను జేరె.
చీకటి పడినంత - చెఱియొక పడక
ఏకాంతమున జేరి - రిర్వురు నంత.
వచ్చిన సన్యాసి - అచ్చట నిచట
చొచ్చి చూచినవాని - చొప్పు విన్పింప
ఉన్న సన్యాసి యే-దో ఊఁ అటంచు
అన్నియు వినక మా-తెన్నునే జూచు
చెప్పువార్తల నిట్లు - చెవి బెట్టకున్న
అప్పుడా కొత్త స-న్యాసి కోపించె.

# ప్రాణరక్షణ



విసుగుచెందని విక్రమార్కుడు మళ్ళీ చెట్టువద్దకు వెళ్ళి, శవాన్ని దించి భుజాన వేసుకుని, మౌనంగా శ్మశానానికేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, తెలియనివాడికోసరం నువు ఇన్ని పాట్లు పడుతున్నావు, కాని అది ఎంత ప్రమాదమో గ్రహించావు కావు. అప్తులు కానివారి ప్రాణాలను కాపాడటానికి యత్నించినా అది ప్రమాదకరంగానే పరిణమిస్తుందని తెలపటానికి నీకు మల్లి కథ చెబుతాను విను," అంటూ ఈ విధంగా చెప్పసాగాడు :

ఒక దూరదేశంలో సముద్రతీరాన గుట్టల మధ్య గుడిసె వేసుకుని ఒక ముసలివాడు నివసిస్తూవుండే వాడు. అక్కడి సముద్ర మంతా రాళ్లమయం. సముద్రంలో పోటు వచ్చినప్పుడు నాచు కొట్టుకువచ్చి ఈ రాళ్ల సందున చిక్కుకుంటూవుండేది. ముసలి వాడు ఆ సముద్రపు నాచు పోగుచేసి సమీ

## బేతాళ కథలు



వచ్చేశాడు. అందుచేత ఆ పనికి వాడి మనమరాలు మల్లి పూనుకున్నది.

మల్లి పదిహేను పదహారేళ్ళ పిల్ల. ఆమె జీవితమంతా సముద్రతీరానే గడిచింది. తాత సముద్రపు నాచుకోసం వెళ్ళేటప్పుడు ఆ పిల్లకూడా వెంట వెళ్ళేది. తాత నాచు అమ్ముకురావటానికి గ్రామానికి వెళ్ళినప్పుడు ఆమె సముద్రతీరం వెంబడివున్న రాళ్ళ గుట్టలమీదుగా వెళ్ళి నాచు దొరికే చోట్లన్నీ పరిశోధించేది.

ఈ పరిశోధనల ఫలితంగా మల్లికి ఒక అద్భుతమైన ప్రదేశం కనిపించింది. అది ఒక కోన. ముసలివాడి ఇంటికి ఎగువగా కొద్ది దూరాన సముద్రం లోపలికి చొచ్చుకు రావటంవల్ల ఈ కోన ఏర్పడింది. దీనినిండా చెదురుచెదురుగా రాళ్ళగుట్టలున్నాయి. సముద్రంపోటు వచ్చినప్పుడు వీటిలో చాలా భాగం మునిగిపోతాయి. ఆటు వచ్చినప్పుడు బోలెడంత సముద్రపునాచు ఆ గుట్టలమీద దిగబడిపోతుంది.

ఆ కోన చాలాప్రమాదకరమైన ప్రదేశం. కాని అక్కడ అంతులేని నాచున్నది. అక్కడికి దారికూడా లేదు. మల్లి తన చేతులతో బరువైన రాళ్లు తెచ్చి అక్కడక్కడా వేసి, తమ ఇంటి ముందునుంచి

పంలో ఉన్న గ్రామంలో అమ్మి ఆ డబ్బులతో జీవయాత్ర సాగిస్తూవుండేవాడు. గ్రామంలో కొద్దిపాటి వ్యవసాయం సాగుతూవుండేది. కాని అక్కడి నేల సారవంతమైనదికాదు. అందుచేత రైతులు సముద్రపు నాచును ఎరువుగా ఉపయోగించేవారు. డబ్బుపోసి సముద్రపు నాచు కొనలేనివాళ్లు సముద్రతీరానికి వచ్చి ఏరుకుపోతూండేవారు. కాని ముసలివాడిలాగా అదే వృత్తిగా జీవించేవా రెవరూ లేరు.

ముసలివాడికి అకస్మాత్తుగా కీళ్ళవాతం వచ్చింది. యాభైఏళ్ళపాటు నాచు పోగుచేసి జీవించినవాడు కాస్తా నడవలేని స్థితికి



కోనకు ఒకదారి ఏర్పాటు చేసుకున్నది. కోనలో ఏ రాళ్లగుట్టలమీద పాచి చేరినదీ, వేటిమీద అడుగుపెడితే కాలు జారకుండా వుండేదీ తెలుసుకున్నది. ఇంత శ్రమపడిన మీదట ఆమె ఆ ప్రదేశంలో సులువుగా బోలెడంత నాచు పోగుచేసి రోజూ గ్రామానికి వెళ్ళి అమ్మకు రాసాగింది.

మల్లి చాలా కార్యదీక్ష గలది. ఆమెకు నాచు పోగుచెయ్యటంమీద తప్ప మరి దేని మీదా దృష్టి లేదు. గ్రామంలో ఆమెకు స్నేహితులంటూ ఎవరూ లేరు. తన యీడు పిల్లలలాగా మంచిదుస్తులు వేసుకుందామని గాని, నగలు పెట్టుకుందామనిగాని ఆమెకు ఆసక్తి లేదు. నాచు అమ్మటం విషయంలో కూడా చాలా నిష్కర్షగా ఉండేది. ఎవ రన్నా తనను మోసం చెయ్యచూస్తే కాట్ల కుక్కలాగా మీదపడేది.

ఒకరోజు ఆమె కోనలో నాచు పోగు చేస్తూండగా ఒక యువకుడు అటుగా వచ్చాడు. ఆ యువకుడి పేరు భరతుడు. అతను ఆ గ్రామంలో వుండే ఒక పెద్ద రైతు కుమారుడు. అతను నాచు పోగుచేసుకోవ టానికి వచ్చాడని గ్రహించి మల్లి, అతన్ని సమీపించి, కోపంగా, "నీకిక్కడ ఏం పని?" అని అడిగింది.



"నీకేంపనో, నాకూ అదే పని! ఇక్కడ ఇంత నాచున్నదని నాకు తెలీదు," అన్నాడు భరతుడు చుట్టూ కలయజూస్తూ.

"ఆ నాచు ముట్టుకుని చూడు!" అన్నది మల్లి బెదిరింపుగా.

"ఏం చేస్తావు? నీపాటి బలం నాకు లేదనుకున్నావా ఏమిటి?" అన్నాడు భర తుడు నవ్వుతూ.

"ఈ కోన నాది! ఇక్కడికి వచ్చే దారి నేనే చేశాను!" అన్నది మల్లి.

"ఈ సముద్రమంతా నీదేనంటావా ఏమిటి? ఇది అందరిదీనీ!" అన్నాడు భరతుడు.

"గాలి అందరిదీనీ! అందుకని మీ ఇంటి కప్పెక్కి గాలి పీలిస్తే నువ్వూరుకుంటావా?" అన్నది మల్లి.

"కావలిస్తే గ్రామాధికారిదగ్గిర ఫిర్యాదు చేసుకో, నేనుమాత్రం ఇక్కడి నాచు తీసుకు పోయి తీరుతాను," అన్నాడు భరతుడు.

మల్లి వెంటనే గ్రామాధికారి దగ్గిరికి వెళ్లి ఫిర్యాదు చేసింది.

"భరతుడన్నమాట అబద్ధం కాదు. ఆ కోనలో వున్న నాచంతా నీదేనంటే లాభం లేదు. అది ఏరుకునేటందుకు అందరికీ హక్కున్నది," అని గ్రామాధికారి సౌమ్యంగా ఆమెతో చెప్పాడు.

"ఆ కోనకు దారి లేదు. మా ఇంటి ముందరిగా వున్న దారే దారి. మా స్థలంలో నుంచి నడవటానికికూడా అందరికీ హక్కున్నదా?" అని మల్లి అడిగింది. భరతుడి తండ్రి తనవద్ద చౌకగా నాచు కొనటానికి ప్రయత్నించాడనీ, తను అమ్మక పోయేసరికి తన కొడుకును పంపకం చేశాడనీ అన్నది.

అంతా విని గ్రామాధికారి, "మల్లీ, ఈ భాగ్యానికి పెద్దవాళ్లతో ఎందుకు తగువు పెట్టుకుంటావు? సముద్రపు నాచు ఒకరి సొత్తు కాదు. దాన్ని ఎవరైన తీసుకోవచ్చు. అదీ కాక ఆ కోనలో చాలా నాచున్నదిట.



నువు తీసుకోగలిగినంత నువు తీసుకో, అత నికి సాధ్యమైనంత అతన్ని తీసుకోనీ!" అని సలహా ఇచ్చాడు.

మల్లి ఈ తీర్పు విని మండిపోయింది. "ఒకరి తీర్పుతో నాకేం పని? ఆ కోనలోకి అడుగు పెట్టినవాళ్ల కాళ్లు విరిగిపోతాయి. అప్పుడుగాని మనుషులకు బుద్ధిరాదు!" అని ఆమె గ్రామంలో కనిపించినవా రందరికీ చెప్పి ఇంటికి తిరిగి వచ్చేసింది.

తరవాత భరతుడు ఆమెతో సంధి చేసు కోవటానికి వచ్చాడు.

"అనవసరంగా మనకీ జగడం దేనికి? నువు ఆడపిల్లవు, నేను మగవాణ్ణి. నీకు అందుబాటులో ఉండే నాచు నేను అంటు కోను. దూరంగా వుండే రాళ్లగుట్టలమీద నేను ఏరుకుంటాను. ఆ విధంగా రాజీపడి మనం యిప్పటినుండీ స్నేహంగా ఉందాం," అన్నాడు భరతుడు.

"ఆ కబుర్లన్నీ తీసిపెట్టు! నీతో నాకు స్నేహమేమిటి? నీకా కోన సంగతి ఏమీ తెలీదు. అందులోకి నువ్వెంతదూరం పోగలవో నేను అంతకంటె ఎక్కువదూరం పోగలను. నాతో అనవసరంగా పోటీపడి చిక్కుల్లో పడకు," అన్నది మల్లి.

"సరే అదీ చూద్దాం!" అన్నాడు భరతుడు పట్టుదలగా.





"మూర్ఖంగా కోనలోకి పోయి గుండంలో పడి బయటికి రాలేక మునిగిపోతుంటే నేను నిన్ను రక్షించను! జ్ఞాపకం ఉంచుకో!" అని మల్లి అతన్ని బెదిరించింది.

భరతుడు నిర్లక్ష్యంగా నవ్వాడు.

కొంతకాలం గడిచింది. ఒకరోజు బాగా ముసురు పట్టింది. గాలికూడా సాగి తుఫాను వచ్చే సూచనలు కనబడ్డాయి. అందుచేత నాచు పోగుచెయ్యటానికి మల్లి తన కొంకి కర్ర తీసుకుని రోజూకన్న పెందలాడే కోనకు బయలుదేరింది.

ఆమె అక్కడికి చేరేసరికి భరతుడు అప్పుడే వచ్చివున్నాడు.



సముద్రం బాగా తెర్లుతున్నది. చినుకులు కూడా ఆరంభమయాయి. భరతుడు ఒక రాతిగుట్టమీద నిలబడి, నాచుకోసం ఎంత దూరం పోగలనా అని చూడసాగాడు. అతనికన్న దూరం వెళ్లటానికి మల్లి నిశ్చయించుకున్నది.

భరతుడు ఎదో నిశ్చయించుకున్నవాడల్లే ఒక గుట్టమీదినుంచి ఇంకొక గుట్టమీదికి దూకుతూ ఉత్తరపు వైపుగా పోసాగాడు. మల్లిమనసు ఆనందంతో నిండిపోయింది. అటుగా అతనికి నాచు దొరకదు. ఆమె చెప్పిన గుండంకూడా అటువేపే ఉంది. మల్లి తన సమీపంలో ఉన్న నాచును కొంకికర్రతో పోగుచేయసాగింది. భరతుడు కూడా అంతదూరాన తనకు దొరికిన నాచును పోగుచేయసాగాడు. కాని తన కుప్పకన్న అతనిది చాలా చిన్నదిగా ఉండటం మల్లి గమనించింది. అతని కర్రకు నాచు చిక్కనప్పుడల్లా మల్లి గట్టిగా, వేళాకోళంగా నవ్వసాగింది. భరతుడికి పౌరుషం రెచ్చిపోసాగింది. ఏవిధంగా అయినసరే మల్లి కన్న ఎక్కువ నాచు పోగుచెయ్యాలని అతను తీర్మానించుకున్నాడు.

అంతలోనే అతని కళ్లు గుండంమీద పడ్డాయి. దానినిండా నాచుండి సుడులు





తిరుగుతున్నది. ఆ నాచుపైన కాలు పెడితే మనిషి తేలుతాడన్నంత మందంగా ఉన్నది. ఆ గుండంలోనుంచి నాచు తీయటానికి ప్రయత్నించటం ఎంత ప్రమాదకరమో మల్లికి తెలుసు. ఆమె దాని చాయల కెన్నడూ పోలేదు. దాని చుట్టూ ఉండే రాళ్లు చాలా జారుడురాళ్లు. ఆటు సమయంలోకూడా దానిలోని నీళ్లు పూర్తిగా తీయవు.

భరతుడు ఈ గుండంచుట్టూ ఉన్న రాళ్లమీదికి వచ్చి, అతి కష్టంమీద కాళ్లు జారకుండా చూసుకుంటూ, తన కొంకి కర్రతో కొద్దిపాటి నాచు పైకి లాగాడు. మరుక్షణమే అతని కాలు జారింది, కాని గుండంలో పడకుండా తప్పుకున్నాడు.

"నీకేమైనా మతిపోయిందా? అందులో పడితే చస్తావు!" అని మల్లి కేకపెట్టింది.

"నీ పని నువు చూసుకో! నా ఊసెందుకూ?" అన్నాడు భరతుడు.

"నీ ఊసు నాకేమీ అక్కర్లేదులే!" అంటూ మల్లి తన కొంకికర్ర ఎత్తుకుని నాచుకోసం వెతుకుతూ కదిలింది. అంతలోనే గుండంలో ఏదో పడిన చప్పుడామెకు వినిపించింది. ఆమె తల ఎత్తి చూస్తే భరతుడు లేడు. అతని శరీరం గుండంలో దొర్లుతూ తిరగటం ఆమె కంటపడింది.



ఆమె కాళ్లమీదా చేతులమీదా పాకుకుంటూ గుండంవద్దకు వెళ్లింది. భరతుడు ఒకసారి తేలి కనిపించాడు. అతని నుదురుకు పెద్ద గాయమై రక్తం కారుతున్నది. అతను దగ్గిరికి రాగానే ఆమె అతని చొక్కా పట్టుకుని తన కొంకికర్ర అందిస్తూ, "ఈ కర్రను గట్టిగా పట్టుకో!" అన్నది. అతను కర్రను పట్టుకున్నాడు. అప్పుడు ఆమె అతన్ని రాళ్లమీదికి లాగింది.

తరవాత ఏం చెయ్యాలో మల్లికి తెలియలేదు. సముద్రంపోటు వస్తున్నది. అక్కడినుంచి అతన్ని తీసుకుపోకపోతే త్వరలోనే తన చుట్టుపక్కల ప్రాంతమంతా మునిగి



పోతుంది. ఆమె అతన్ని ఎత్తటానికి ప్రయత్నించింది. ఆమెకు ఎక్కడలేని సత్తువా వచ్చింది. అతన్ని మోసుకుంటూ ఆమె అతి ప్రయాసమీద తన గుడిసెకు చేరుకున్నది.

భరతుడి కిప్పుడు స్పృహలేదు. అతని మొహం పూర్తిగా పాలిపోయివున్నది. అతన్ని చూసి ముసలాడు, "మల్లీ, ప్రాణం పోయినట్టుందే!" అన్నాడు.

"ఇంకా లేదు, తాతా. నేను గ్రామానికి వెళ్లి వాళ్లవాళ్లను పిలుచుకువస్తాను! బతికించుకుంటారేమో!" అన్నది మల్లి.

"ఇంకా నయం! అటువంటి పిచ్చి పని చెయ్యకు! పగకొద్దీ మనమే చంపామంటారు!" అన్నాడు ముసలాడు. మల్లి ఒక్క క్షణంపాటు నివ్వెరపోయింది. మరు క్షణం, "అంటే అననీ!" అంటూ ఆమె గ్రామానికి పరిగెత్తింది.

త్వరలోనే భరతుడి తల్లీ, తండ్రీ, నౌకర్లూ వచ్చారు. తల్లి భరతుడిమీద పడి, "అయ్యో, నిన్ను పొట్టన పెట్టుకున్నార్రా, తండ్రీ!" అంటూ ఏడిచింది. భరతుడి తండ్రి ఊరుకోమని భార్యను మందలిస్తూ, "నాకొడుకును ఇంత చేసిన వాళ్ల రక్తం కళ్ళ చూడకుండా వదిలిపెడతానా?" అన్నాడు.

మల్లికి గుండెలు అవిసిపోయాయి. తన తాత చెప్పినంతా కాబోతున్నది! భరతుడు



ఎట్లాగూ బతకడు! హత్యానేరం తనమీద మోపి, తనను ఉరి తీస్తారు! తాను అతన్ని రక్షించటానికి తన ప్రాణాన్ని ఒడ్డినట్టు సాక్ష్యం ఏముందీ?

స్పృహ లేకుండా వున్న తమ కొడుకునూ, మల్లినీ వెంటబెట్టుకుని రైతు దంపతులు తమ గ్రామానికి వెళ్లారు. వారు మల్లిని గ్రామాధికారికి వప్పగించి, తమ కొడుకు నాచు తీసుకుపోతున్నాడని కొట్టి చంపే సిందని ఫిర్యాదుచేశారు. ఆయన ఆ రాత్రల్లా మల్లిని ఖైదులో వుంచాడు.

ఒకరాత్రివేళ భరతుడు పెద్దగా మూలిగి కళ్లు తెరిచాడు.

"ఏం, నాయనా?" అంటూ తల్లి అతని ఎదటికి వెళ్లింది. అతను ఎవరికోసమో వెతుకుతున్నట్టుగా చుట్టూ చూశాడు. అతనికి స్పృహ వచ్చినందుకు తల్లి దండ్రులు చాలా సంతోషించారు. అతను బతుకుతాడని వైద్యుడుకూడా వాళ్లకు ధైర్యం చెప్పాడు.

మర్నాడు భరతుడి తండ్రి ఖైదులో వున్న మల్లికోసం వచ్చాడు. మల్లి ఆయనను చూసి నిర్ఘాంతపోయింది. "తల్లీ, మావాడు నీకోసం కలవరిస్తున్నాడు. నిన్ను చూడందీ వాడు కన్నుమూసి నిద్రపోయేటట్టు లేడు! ఒక్క సారి మాయింటికి రా! నీరుణం ఉంచు





కోనులే!" అని పిలిచాడు. మల్లి వెళ్లింది. అమెను చూసి భరతుడు చాలా సంతోషించాడు. తరవాత కాలక్రమాన భరతుడు కోలుకున్నాడు. అతనికి మల్లినిచ్చి పెళ్లి చేశారు. మల్లి తన తాతతో సహా సముద్ర తీరాన్నీ, గుడిసెనూ వదిలి శ్రీమంతుల ఇంటో అడుగు పెట్టింది.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకు ఒకే ఒక సందేహం! తాత వద్దంటున్నా వినక, తనమీద హత్యానేరం మోపుతారనికూడా జంకక మల్లి భరతుడి తల్లిదండ్రులవద్దకు ఎందుకు వెళ్ళింది? భరతుడిమీద ప్రేమ చేతనా? తనతో పంతానికి వెళ్ళి భరతుడు అపాయం వాత పడ్డాడన్న పశ్చాత్తాపం చేతనా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగిలి పోతుంది!" అన్నాడు.

"మల్లికి భరతుడిమీద అంతలో ప్రేమ కలగవలసిన కారణమేమీ లేదు. ఆమెకు సరిఅయిన సమయంలో అతని ప్రాణాన్ని కాపాడాలనే పుణ్యభావం కలిగింది. పుణ్య కార్యాలకు పూనుకున్నవారు తమప్రయత్నం సఫలంకావటానికి ఎంత త్యాగమైనా చేస్తారు. అందుచేతనే మల్లి తెగించి ఆ గుండంవద్దకు వెళ్ళింది. అతన్ని ఆమె గుండంనుంచి రక్షించిందేగాని అపాయస్థితినుంచి రక్షించటం ఆమెవల్ల కాలేదు. ఆ పని భరతుడి తలిదండ్రులు మాత్రమే చేయగలరు. అందుచేత వారిని పిలవటానికి ఆమె గ్రామానికి బయలుదేరింది. అదివరకు ఒకసారి తన ప్రాణాన్ని పోగొట్టుకున్నంత పని చేసి భరతుణ్ణి గుండంనుంచి రక్షించిన మల్లికి, అతని తలిదండ్రులు తనను హంతకురాలంటారేమోనన్న భయం లేకపోవటంలో ఆశ్చర్యం ఏమీ లేదు!" అన్నాడు విక్రమార్కుడు.

ఈ విధంగా రాజుకు మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతోసహా మాయమై మళ్ళీ చెట్టెక్కాడు. —(కల్పితం)





# సద్గుణాలూ — దుర్గుణాలూ

శ్రీమహావిష్ణువు అనుజ్ఞప్రకారం బ్రహ్మ దేవుడు సృష్టి అంతా పూర్తిచేశాక కొన్ని గుణాలనుకూడా సృష్టించి, "మీరంతా మానవుల వెంట నివసించి వారికి తోడ్పడండి", అని చెప్పి భూలోకానికి పంపాడు.

మొట్టమొదటగా భూమిమీదికి వచ్చినప్పుడు గుణాలన్నీ పైకి చూడటానికి ఒకటిగానే ఉండేవి. వాటి స్వభావాలు వేరయినప్పటికీ అన్నిటిమధ్యా సఖ్యం ఉండేది. అవి కలిసే జీవించేవి, కలిసే సంచరించేవి. ఇలా కొంతకాలం జరిగింది.

కాని కాలం గడిచినకొద్దీ వాటి మధ్య చీలికలు ఏర్పడ్డాయి. కొన్ని గుణాలకు క్రమంగా పరపతి తగ్గసాగింది. వాటికి జీవితం దుఃఖమయం కాసాగింది. వాటికి పోషణ లేకుండాపోయింది. ఇవి సద్గుణాలు.

ఇదే సమయంలో దుర్గుణాలు బాగా విజృంభించాయి. చూస్తూవుండగానే వాటి జీవితం మూడు పువ్వులూ ఆరు కాయలూ కాసాగింది. ఎక్కడ చూసినా వాటికే ఆదరం లభించసాగింది.

ఈ మార్పు క్రమంగా హెచ్చినకొద్దీ సద్గుణాలు దుర్గుణాలతో కలిసి తిరగటం మానేసి వేరే ప్రాంతాల స్థావరాలు చూసుకున్నాయి. కానీ ఈ ప్రాంతాలు అందమైనవికావు, భాగ్యవంతమైనవి కావు. దుర్గుణాలుమటుకు మంచి దుస్తులు ధరించి, మంచి తిండి తిని, గొప్ప గొప్ప భవనాలలో జీవిస్తూ ప్రపంచం అన్ని మూలలకూ స్వేచ్ఛావిహారం చేసి రాసాగాయి.

ఒకరోజు సద్గుణాలన్నీ సమావేశమై తమ స్థితిని గురించి చర్చించుకున్నాయి.

"మనం సద్గుణాలం కదా? మన గతి ఇలా కావటానికి కారణమేమిటి? ఉండటానికి సరిఅయిన ఇళ్లులేవు, తినటానికి సరిఅయిన తిండిలేదు. మనం ఎక్కడికి

కె. వి. శంకరం





వెళ్లినా అందరూ చీదరించుకునేవారే! ఆ దుర్గుణాలను చూడండి! వాటి వైభవం చెప్పతరంకాదు. అవి ప్రపంచమంతటా స్వేచ్ఛావిహారం చేసి ఎంతో మర్యాదా, సన్మానమూకూడా పొందుతున్నాయి," అని ధర్మం అన్నది.

"వాళ్లు చీనాంబరాలు వేసుకున్నారనీ, పాపులైన మానవులు వాళ్లను ఆదరిస్తున్నారనీ మనం విచారించటం సబబుకాదు. పుణ్యాత్ములైనవారంతా మననే కీర్తిస్తున్నారు. పుణ్యాత్ములు కానివారుకూడా గ్రంథాలలో మనమే గొప్ప అని రాస్తున్నారు. ప్రపంచంలో ఉన్న గొప్ప పుస్తకం ఏదన్నా తీసి చూడండి, మన ప్రశంసే ఉంటుంది. అది మనకు చాలదా?" అన్నది తృప్తి.

"ఆ గ్రంథాలను చూసేవారు లేరు! వాటిని చెదలు తినేస్తున్నాయి! మనకు ప్రపంచంలో ఎంత ఆదరణ ఉందో, మనని మెచ్చుకునే పుస్తకాలకుకూడా అంతే ఆదరణ ఉంది!" అన్నది సత్యం.

"అందుచేత మనం చెయ్యవలిసిందేమిటంటే, ప్రజలకు దగ్గిరిగా వెళ్లి వారి దృష్టి మనవేపు మరల్చుకుని, ఈ దుర్గుణాలకు ప్రపంచంలో పరపతి లేకుండా చేసెయ్యాలి. ఆ ఉద్దేశంతోటే మనని బ్రహ్మదేవుడు పంపాడు. మనని ఎవరూ ఆదరించటం లేదని మానవప్రపంచానికి దూరంగా పోవటం మనదే తప్పు!" అన్నది దీక్ష.

దీనికి సద్గుణాలన్నీ ఆమోదించాయి. దీక్ష చెప్పిన సలహా ఆచరణలో పెట్టటానికిగాను అవి అన్నీ బయలుదేరి జనసమ్మర్దం గల ఒక నగరంలో ప్రవేశించి, దారేపోయే వారితో, "మేము సద్గుణాలం! మీరు ఆదరించకపోవటంచేత మా స్థితి ఎంత హీనంగా ఉందో చూడండి. ఇప్పటికైనా మేలుకుని, దుర్గుణాలను ఆదరించటం మాని మమ్మల్ని ఆదరించండి, మీ జీవితం స్వర్గతుల్యం అవుతుంది!" అని ప్రబోధించసాగాయి.





"పుట్ట పగిలినట్టు మీరంతా వచ్చిపడ్డా రేమిటి? ఒకటి రెండు సద్గుణాలతోనే మేము సతమతమవుతుంటే మీరంతా దేనికి? పదండి, పదండి, ఇంకెక్కడికైనా వెళ్లి ఆదరించే వాళ్లను చూసుకోండి!" అని ప్రజలు సద్గుణాలను చీదరించుకున్నారు.

మిగిలిన సద్గుణాలు న్యాయంకేసి తిరిగి, "ఏమిటీ ఘోరం! నీపేర ఈ నగరంలో అధికారులూ, భటులూ కొల్లలుకొల్లలుగా ఉన్నారు గదా! ప్రజలు మనపట్ల ఇంత నిర్లక్ష్యంగా ఉన్నారేమిటి?" అన్నాయి.

న్యాయం సిగ్గుతో తల వంచుకుని, "అన్న లారా, అక్కలారా! న్యాయాధికారులూ, రక్షకభటులూ నా చెప్పుచేతలలో ఉంటే నేను మీతోపాటు అష్టకష్టాలూ పడటం ఎందుకు జరుగుతుంది? నేను గొప్పగా ఉంటూ మిమ్మల్నికూడా గొప్పస్థానాలలో ఉంచనా?" అన్నది.

"ఇప్పుడు మనం ఏం చెయ్యాలి?" అన్న సమస్య సద్గుణాలను ఎదుర్కొన్నది.

"నేను చెబుతున్నాను వినండి! ఈ లోకంలో మనమైనా ఉండాలి, ఆ దుర్గుణా లైనా ఉండాలి; అంతేకాని రెంటికీ తావు లేదు! వాళ్లు బాగా తిని కొవ్వి ఉంటేనేం? మనం బక్కచిక్కి ఉన్నా మన ఆత్మబలం అమోఘమైనది! మనం ఆ దుర్గుణాలతో





కలియబడి యుద్ధం చేసినట్టయితే మనకు విజయం లభించి తీరుతుంది! ఈ ప్రపంచంలో దుర్గుణమనేది లేకుండా రూపుమాపి మానవలోకాన్ని స్వర్గంతో సమంగా చేద్దాం! అప్పుడుగాని సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడిపట్ల మనం మన ధర్మాన్ని నిర్వర్తించినవాళ్లం కాము!" అన్నది ఆదర్శం.

సద్గుణాలన్నీ కలిసి హర్షధ్వానాలు చేశాయి. ఆదర్శాన్ని తమ నాయకుడుగా పెట్టుకుని అవి దుర్గుణాలమీద యుద్ధం ప్రకటించాయి. దుర్గుణాలు ధైర్యంగా యుద్ధపు పిలుపు విని సద్గుణాల సంగతి తేల్చటానికి బయలుదేరి వచ్చాయి. రెండు



పక్షాలకూ మధ్య ఒక అరణ్యంలో పెద్ద దొమ్మియుద్ధం జరిగింది. ఈ యుద్ధంలో ఏ పక్షానికీ విజయం చేకూరలేదు.

ఆ అరణ్యంలోనే ఒక తత్వజ్ఞాని ఉంటున్నాడు. యుద్ధకోలాహలం విని ఆయన తన తత్వవిచారం కట్టిపెట్టి, సద్గుణాలూ దుర్గుణాలూ పోట్లాడే చోటికి వచ్చాడు.

"మీకేమైనా మతి పోయిందా? ఎందుకుగాను ఈ యుద్ధం చేస్తున్నారు?" అని తత్వజ్ఞాని ఉభయపక్షాలనూ అడిగాడు.

"భూప్రపంచంలో ఈ దుర్గుణాలు లేకుండా చెయ్యటం మా విధి. ఇవి మానవులను తమవేపు ఆకర్షించి పాపాన్ని పెంపొందజేస్తున్నాయి. వీటిని నిర్మూలించి ప్రపంచంలో పుణ్యాన్ని ప్రతిష్ఠ చేస్తాం!" అన్నాయి సద్గుణాలు.

"ఎవరూ ఆదరించేవారు లేక దిక్కులేని పక్షులైపోయి ఈ సద్గుణాలు మాపైన కత్తి కట్టాయి. అసలు ప్రపంచానికి ఏలికలం మేమే! ఆ సంగతి నిరూపించటానికి మేము ఈ సద్గుణాలతో యుద్ధం చేస్తున్నాం!" అన్నాయి దుర్గుణాలు.

"మీరంతా పరమ మూఢులు! మీలో ఒకరు ఎక్కువా ఒకరు తక్కువా లేదు. బ్రహ్మదేవుడు మొదట సృష్టించినప్పుడు





మీరంతా ఒకటిగానే వున్నారు. ఈ తేడాలు మీరు సృష్టించుకున్నవే. తాము ఎక్కువైన వాళ్ళమని సద్గుణాలు అనుకున్నాయి; తాము బలమైనవాళ్ళమని దుర్గుణాలు అనుకున్నాయి. నిజమైన జ్ఞానికి పుణ్య పాపాలు రెండూ ఒకటే. అటువంటివాడు సద్గుణాలకూ, దుర్గుణాలకూ కూడా అతీతుడుగా ఉంటాడు. కనక మీరు ఈ వృథా కలహం మాని సఖ్యంగా ఉండటం నేర్చుకోండి!" అన్నాడు తత్వజ్ఞాని.

వెంటనే రెండు పక్షాలూ యుద్ధం విరమించి వెళ్ళిపోయాయి. కాని రాజీ జరగటం ఎలా? రాయబారిగా ఎవరు వెళ్లేట్టు? దుర్గుణాలు రాజీకి వప్పుకుంటాయా? ఈ సమస్యలు వచ్చాయి.

"దుర్గుణాలు మనం అనుకున్నంత గొప్పగా ఏమీ బతకటం లేదు. ప్రజలు వాటిని ఒక కంట కనిపెట్టి వుంటూనే ఉన్నారు. ఎన్నోసార్లు లంచగొండితనం జరిమానాలు చెల్లించి, అవమానానికి గురి అయింది. అవినీతిని పట్టుకుని చాలాసార్లు ఖైదులో పడవేశారు. కామం అప్పుడప్పుడూ చెప్పుదెబ్బలు తింటూనే వుంది. అందుచేత వాళ్లు మనతో రాజీకి ఒప్పుకోకపోరు!" అన్నది వివేకం.



ఇక, రాయబారిగా పంపటానికి సదాచారం అన్నివిధాలా తగినదిగా కనబడింది. ఆవిడ వృద్ధురాలు. అందరూ గౌరవంగా చూస్తారు. సద్గుణాల జాతికి చెందిన దన్న టానికి ఏమీ సందేహం లేదు; ఎందుచేతనంటే, మిగిలిన సద్గుణాలలాగే తరుచు పూరిగుడిసెలలో వుంటుంది. ధనికులు ఆమెను తమ ఇళ్ళలో ఉంచుకోకపోయినా, వచ్చినప్పుడు చాలా మర్యాదగానే చూస్తారు. అందుచేత తమ రాయబారిగా సదాచారాన్ని పంపటానికి సద్గుణాలు నిశ్చయించాయి.

అయితే సదాచారాన్ని చూస్తే దుర్గుణాలకు కొంచెమైనా గురి లేదు. ఆమెచాటున



అవి ఎప్పుడూ తమ యిష్టంవచ్చినట్టు విజృం భిస్తున్నాయి. ఆమెను చూడగానే అవి, "ఛీ, ఛీ! నీ మొహం చూపించకు! నువు మొదటనుంచీ మమ్మల్ని ఏదో విధంగా ఉపయోగపరుచుకుంటూనే వున్నావు. నువు మాతో రాయబారం చెయ్యేట మేమిటి?" అని తరిమికొట్టి పంపేశాయి.

ఇప్పుడేం చెయ్యాలో సద్గుణాలకు తోచ లేదు. అవి ఈ స్థితిలో ఉండగా ఒక వింత జీవం వాటి మధ్యకు వచ్చింది. ఆ జీవం ఆడదో, మగదోకూడా సద్గుణాలకు తెలియ లేదు. అది సద్గుణాలతోపాటు జీవించి, వారి కష్టసుఖాలు పంచుకున్నదికాదు. చూడటానికి చాలా మర్యాదగా, గంభీరంగా కనిపించింది.

"మీ ఉభయ పక్షాలమధ్యా నేను రాజీ కుదుర్చుతాను. ఆ తరవాత మీకూ మీకూ ఎటువంటి తగాదాలూ రానవసరం ఉండదు. మీకూ వారికీ కూడా గౌరవ మర్యాదలు వృద్ధిపొందుతాయి," అన్నది ఈ కొత్తగుణం. ఈ గుణం పేరు కపటం.

సద్గుణాలు సంతోషంతో ఇందుకు సరే నన్నాయి. కపటాన్ని చూడగానే దుర్గుణాలు కూడా చాలా అద్భుతపడ్డాయి. ఎందుకంటే కపటానికున్న ఠీవీ, హుందా మిగిలిన ఏ దుర్గుణానికీ లేవు. నిజానికి దుర్గుణాలన్నీ మొరటువే. కపటంలో అంతులేని నాజూకూ, నాగరికతా వున్నాయి.

కపటం అతి సులువుగా సద్గుణాలకూ దుర్గుణాలకూ మధ్య తగాదామాన్ని, రాజీ కుదిర్చింది. ఆ నాటినుంచీ నవనాగరిక యుగం ఆరంభమయింది.

ఈనాటికికూడా ఏ సద్గుణం ఏ దుర్గుణాన్ని కలుసుకుని సఖ్యం చేయదలచినా కపటాన్ని వెంటపెట్టుకు పోతుంది. ఇందువల్ల సద్గుణా నికి గల ఖ్యాతి చెడదు, దుర్గుణానికి గల పరపతీ చెడదు. అందుచేత ఆఖరు విజయం ఎప్పుడూ కపటానిది.






## 6

[ రూపధరుడు ఒక ఏడాదిపాటు సుకేశినికి అతిథిగా ఉండి, తన అనుచరుల ప్రోద్బలం పైన ఇంటికి ప్రయాణంకట్టాడు. అతను సుకేశిని సలహాపై యమలోకానికి వెళ్లి, అక్కడ తలవనితలంపుగా తన తల్లియొక్క ప్రేతాత్మను కలుసుకుని, ఆమెద్వారా తన కుటుంబ పరిస్థితులు తెలుసుకున్నాడు. ]

రూపధరుడు తన తల్లితో మాట్లాడుతున్న సమయంలో ఇంకా అనేక ప్రేతాత్మలు బలి ఆరగించటానికి మందలు మందలుగా వచ్చాయి. రూపధరుడు అందరి పరిచయమూ చేసుకున్నాడు. ఆ వచ్చిన వారిలో నవద్యోతుడి తల్లీ, భువనసుందరి తల్లీకూడా ఉన్నారు.

బలులు పుచ్చుకున్న ప్రేతాత్మలు చాలా భాగం వెళ్లిపోయాయి. అంతలో అక్కడికి రారాజు ప్రేతాత్మ వచ్చింది. బలి అరగించగానే రారాజు రూపధరుణ్ణి గుర్తించి బావురుమని ఏడిచి, రూపధరుడికేసి చేతులు చాచాడు. కాని ప్రేతాత్మ బతికున్నవాణ్ణి ఆలింగనం చేసుకోవటం సాధ్యంకాదు.

రూపధరుడు విస్మయంతో, "ప్రభూ, మీరిక్కడికి ఎప్పుడు వచ్చారు? ఎలా వచ్చారు?" అని అడిగాడు.

"అజబలుడనే దుర్మార్గుడూ, నా భార్యా కలిసి నన్ను హత్యచేయటానికి కుట్రపన్ని, నన్ను అతిథిగా ఆహ్వానించి, భోజనాల






సమయంలో హత్యచేశారు. నాతోబాటు నా పరివారాన్ని కూడా చంపేశారు. నువు యుద్ధంలో అనేక రకాల ఘోరమైన చావులు చూసివుంటావు; కాని భోజనాల ముందు అంతమంది హత్యకావటం ఊహించనుకూడా లేవు," అన్నాడు రారాజు.

"అవును, ప్రభూ! స్త్రీబుద్ధి ప్రళయాంతకమైనది. మీరు యుద్ధంనుంచి తిరిగి రాకపూర్వమే, మిమ్మల్ని హత్యచెయ్యటానికి మీ భార్య ఆలోచన చేసివుండాలి. ఆడదాన్ని నమ్మరాదు. భువనసుందరి చూడరాదా? ఆమెకోసం ఎంతమంది బలి అయారు!" అన్నాడు రూపధరుడు.

"నీ భార్యమటుకు చాలా గొప్ప సాధ్వి. పాపం, నువు యుద్ధానికి బయలుదేరేసరికి ఇంకా కొత్తపెళ్లికూతురే, తొలిచూలు బాలింతరాలు! ఆ పిల్లవా డీపాటికి పెరిగి పెద్దవాడై ఉండాలి!" అన్నాడు రారాజు.

వారీ విధంగా మాట్లాడుకునే సమయంలో అక్కడికి వజ్రకాయుడూ, పితృకీర్తీ ప్రేతాత్మల రూపంలో వచ్చారు. ట్రోయ్ యుద్ధంలో మరణించిన ఇతర గ్రీకువీరులు కూడా వచ్చారు.

వజ్రకాయుడు రూపధరుణ్ణి గుర్తించగానే పలకరించి, అనేక విషయాలు ముచ్చటించి, "నా కొడుకు క్షేమంగా ఉన్నాడా? అతను ఎలాటి యోధుడు?" అని అడిగాడు.

"నీ కుమారుడు నవయోధుడు చాలా పరాక్రమవంతుడు. నవద్యోతుడి తరవాతా, నా తరవాతా అతనిలాగా వ్యూహరచన చేసిన వాడు లేడు. అతను ఎందరినో పరాక్రమవంతులను సమయుద్ధంలో ఓడించాడు. కొయ్యగుర్రంలోకి ఎక్కినవారిలో అతను ఒకడే భయంతో వణకలేదు. మీదుమిక్కిలి, కత్తి చేతబట్టుకుని కూచుని, ట్రోయ్‌మీద పడటానికి అనుజ్ఞ ఇవ్వమని నన్ను ఎంతగానో తొందరపెట్టాడు. యుద్ధంలో ఎందరు చచ్చారో, ఎందరు గాయపడ్డారో చెప్పలేను;







నవయోధుడి ఒక్కడి శరీరానికి మాత్రమే ఒక్క చిన్న గాయంకూడా తగలలేదు!" అన్నాడు రూపధరుడు.

ఈ మాటలు విని వజ్రకాయుడి ప్రేతాత్మ పరమానందం చెంది వెళ్ళిపోయింది. చూడ వలసినవారందరినీ చూడటం పూర్తిచేసి రూపధరుడు తన నౌకకు తిరిగివచ్చి తిరుగు ప్రయాణం సాగించాడు. త్వరలోనే నౌక సుకేశిని ఉండే దీవిని చేరుకున్నది.

సుకేశిని రూపధరుణ్ణీ, అతని అనుచరులనూ ఆహ్వానిస్తూ, "మీరు మొత్తానికి భలే వాళ్లు! అందరూ యమలోకానికి ఒక్క మారే ప్రయాణం చేస్తారుగాని, మీరుమాత్రం రెండో ప్రయాణానికి అవకాశం అట్టేపెట్టుకున్నారు. ఇవాళ మీరు నా అతిథులుగా ఉండి తనివిదీర తినండి, తాగండి; రేపు ఉదయం యిక్కడినుంచి బయలుదేరి పోదురుగాని!" అన్నది.

గ్రీకులు పగలల్లా తినటంలోనూ, తాగటంలోనూ గడిపారు. పొద్దు వాలి చీకటి పడగానే రూపధరుడు తప్ప మిగిలినవారంతా నౌకవద్దకు వెళ్ళి, దాని సమీపాన ఇసకలో పడుకుని నిద్రపోయారు. రూపధరుడు సుకేశిని ఇంటనే ఉండి, యమలోకంలో తాను చూసిన వింతలన్నీ చెప్పాడు.

అంతా విని సుకేశిని ఇలా అన్నది: "అదంతా గతించిన విషయం. ఇక జరగవలిసినదాన్నిగురించి నేను చెప్పేది శ్రద్ధగా విను. నీకు ప్రయాణంలో మొట్టమొదటగా నాగకన్యకలు తగులుతారు. వారి గొంతులకు సమ్మోహన శక్తి ఉన్నది. వారి పిలుపు విన్నవారికి ఆయువు మూడినట్టే! అందుచేత వారుండే దీవి రాకమునుపే నీ అనుచరులందరి చెవులలోనూ మైనం పెట్టేసి నాగకన్యకల పాటలు వినిపించకుండా చెయ్యి. నీకు వారి పాటలు వినాలని కోరిక ఉన్నట్టయితే, నీ అనుచరులు నిన్ను తెరచాప స్తంభానికేసి గట్టిగా బంధించాలి.

నువు ఎంత కేకలు పెట్టినా కట్లు ఊడదీయ వద్దని నీ అనుచరులతో గట్టిగా ముందే చెప్పి ఉంచు. అప్పుడు నువు వారి పాటలు విన వచ్చు; అందువల్ల నీకు ప్రమాదం ఉండదు. నాగకన్యకలుండే దీవి దాటి, వారి గొంతులు వినిపించకుండా పోయాక నీకు సముద్రం మీద రెండు మార్గాలు తగులుతాయి. వీటిలో నువు ఏమార్గం తీసుకుంటావో నేను చెప్ప లేను. ఒక మార్గం రెండు నిటారుకొండల మధ్యగా పోతుంది. ఆ కొండల మధ్యకు ఒక చిన్న పక్షి వచ్చినా సరే అవి ఒకదానితో ఒకటి ఢీకొట్టి చంపేస్తాయి. అవి కదిలే కొండలు. వాటి మధ్యకు వెళ్లి నాశనంకాని నౌక అంటూ ఉండదు. ఇక నీ రెండవ మార్గం విధ్వంసినీపర్వతం పక్కగా ఉంటుంది. ఈ పర్వతం చాలా ఎత్తయినది. దీని శిఖరం అన్నికాలాలలోనూ మేఘాలు కప్పి ఉంటుంది. అందుచేత దానిని చూసిన వారెవ్వరూ లేరు. ఆ పర్వత శిఖరాన్ని ఎక్కినవారుకూడా ఎవరూ లేరు. ఎందు చేతనంటే ఆ పర్వతం నున్నగా, కాలు పెడితే జారిపోతూ ఉంటుంది. ఆ పర్వతం చరియలో ఒక గుహ ఉన్నది. అది పడమటి వేపు చూస్తూ ఉంటుంది. ఆ గుహలో విధ్వంసిని అనే రాక్షసి ఉన్నది. ఆమె అప్పుడే పుట్టిన కుక్కపిల్లలాగా కుంయి





కుంయి మని మొరుగుతుంది. అయినా ఆ మొరుగుడు భయం కలిగిస్తుంది. ఆ రాక్షసికి పన్నెండు కాళ్లూ, ఆరు తలలూ ఉన్నాయి. ఆమెకు గల ఆరు మెడలూ అతి పొడుగైనవి. ఆమె ఉండే గుహ సముద్రమట్టానికి ఎంతో ఎత్తున వుంటుంది. ఎంత గొప్ప విలుకాడు కూడా, అంత ఎత్తు బాణం వెయ్యలేడు. అయినప్పటికీ విధ్వంసిని నడుము పైభాగం గుహలోనుంచి బయటికి పెట్టి, సముద్రంలో గల చేపలను తన నోళ్లతో అందుకో గలదు. ఆమెకు అందుబాటులోకి వెళ్లి ప్రాణాలతో బయటపడిన నావికుడు ఇంతవరకు లేడు. ఈ కొండకు బాణంవేటు దూరంలో ఒక సుడిగుండం ఉన్నది. ఈ సుడిగుండంలో చిక్కుకున్న నౌక నాశనం కాకుండా చేసే శక్తి ఈశ్వరుడికికూడా లేదు. నీ నౌకను ఈ సుడిగుండం మీదుగా తీసుకుపోవటంకంటె, విధ్వంసినీ పర్వతం పక్కగా తీసుకుపోవటం చాలా క్షేమం. నౌక వేగంగా పోయినపక్షంలో, విధ్వంసిని తన ఆరు నోళ్లతోనూ ఆరుగుర్ని పట్టుకున్నప్పటికీ మిగిలిన వాళ్లు దక్కుతారు. సుడిగుండంలో చిక్కిన నీ నౌకకు నామ రూపాలుండవు.

"తరవాత నువు త్రినాసియాదీవి చేరుకుంటావు. అక్కడ సూర్యభగవానుడి ఆవుల మందలూ, గొర్రెలమందలూ వుంటాయి.





మందకు యాభై చొప్పున ఏడు ఆవుల మందలూ, ఏడు గొర్రెలమందలూ వుంటాయి. వాటిని సూర్యుడి కుమార్తె లిద్దరూ కాస్తూ వుంటారు. ఆ మందలకు చావూ, పుట్టుకా లేదు. నువుగాని, నీ అనుచరులుగాని ఆ మందల జోలికి పోవద్దు. అలా పోయి నట్టయితే నీ నౌకా, అనుచరులూ నాశనమై పోతారు. నీకు ఎలాగూ కష్టాలు తప్పవు. అందుచేత వాటిని అనవసరంగా పెంచుకోకు."

సుకేశిని ఇలా చెప్పిన అనంతరం తూర్పు తెల్లవారింది. రూపధరుడు తన నౌకవద్దకు తిరిగివచ్చి తన అనుచరులను లేపాడు. త్వరలోనే నావికులు లంగరు ఎత్తి నౌకను బయలుదేరదీశారు. సుకేశిని అనుగ్రహం వల్ల ఆ సమయంలో అనుకూలమైన గాలి వీచి తెరచాపను నించింది.

మొట్టమొదట రాబోయే ప్రమాదం నాగ కన్యకలనుంచి. అందుచేత రూపధరుడు తన అనుచరులతో సుకేశిని చెప్పిన విషయా లన్నీ చెప్పి, వారందరి చెవులలోనూ మైనం కుక్కి వాళ్లను చెవిటివాళ్లుగా చేసేశాడు. తరవాత వారు రూపధరుణ్ణి తెరచాప స్తంభాని కేసి బలమైన మోకుతో కట్టేశారు. "నేను కట్లు విడిపించుకోవటానికి యత్నిస్తే మరింత గట్టిగా కట్టండి!" అని అతను వారితో ముందుగానే చెప్పాడు.

నాగకన్యకలు తమ దీవినుండి రూప ధరుడి నౌకను చూసి గొంతులెత్తి పాడ సాగారు. వారు రూపధరుణ్ణి పేరుపెట్టి పిలిచి, తియ్యని తమ పాటలు విని మరీ వెళ్లమన్నారు. వారి పాట వింటున్నకొద్దీ రూపధరుడికి ఇంకా వినాలనిపించింది. తన కట్లు విప్పమని అతను తన అనుచరులను బతిమాలాడు. అతని వాలకం చూసి వారు అతన్ని మరింత గట్టిగా కట్టారు.

కొద్దిసేపట్లో నౌక దూరం వెళ్ళిపోయింది. నాగకన్యకల గొంతులు ఇక వినిపించటం





లేదు. అప్పుడు రూపధరుడి అనుచరులు తమ చెవులలో పెట్టుకున్న మైనం తీసే శారు, రూపధరుడి కట్లు విప్పేశారు. అంత లోనే రూపధరుడికి అంతదూరాన గుండ్రగా తిరుగుతూ బ్రహ్మాండమైన అల ఒకటి కని పించింది. అదే సుడిగుండం. దాన్ని చూసీ చూడటంతోనే రూపధరుడి అనుచరులు హడలిపోయారు.

"మీరేమీ భయపడకండి. ఫాలలోచ నుడి బారి పడిసదానికంటె ఇదేమంత ప్రమాదం కాదు. నౌకను ఆ కనపడే కొండసమీపంగా నడపండి!" అన్నాడు రూపధరుడు.

అతను తన అనుచరులతో ఆ కొండ గుహలో ఉండే విధ్వంసిని గురించి చెప్ప లేదు. చెబితే వారు బెంబేరెత్తి తెడ్లు అవతల పారేసి ఉండేవారే. రూపధరుడుమాత్రం కొండకేసి పరీక్షగా చూశాడు. మబ్బులు ఆవరించి ఉండటంచేత అతనికి రాకసి ఉండే గుహగాని, రాకసి జాడగాని కనిపిం చనేలేదు. మిగిలినవారి కళ్లుమాత్రం సుడి గుండంమీదే ఉన్నాయి.

ఇంతలో రాకసి ఆరు తలలూ చాచి రూపధరుడి అనుచరులను ఆరుగురిని పట్టు కుని తన గుహకేసి లాగేసుకున్నది. మరి



కొద్దిసేపటిలో నౌక కొండను దాటి ముందుకు వెళ్ళిపోయింది.

రూపధరుడు అంతదూరాన చాలా మనో హరమైన దీవిని చూశాడు. ఆ దీవినుంచి ఆవుల అంబారవాలూ, గొర్రెల అరుపులూ వినవస్తున్నాయి. అదే సూర్యభగవానుడి మందలుండే దీవి.

ఈ సంగతి గ్రహించగానే రూపధరుడికి సాంకేతికుడు చేసిన హెచ్చరికా, సుకేశిని చేసిన హెచ్చరికా స్ఫురణకు వచ్చాయి. అతను భయపడుతూ తన అనుచరులతో ఇలా అన్నాడు: "మిత్రులారా, ఈ మనో హరమైన దీవి మీద మనకు అడుగుపెట్టే



ప్రాప్తం లేదు. మీరందరూ ఎంతో అలసట చెంది, సుఖంకోసం తహతహలాడిపోతున్నారని నాకు తెలుసు. కాని ఈ దీవిమీద అడుగు పెడితే ఘోరప్రమాదం తప్పదని నాకు సాంకేతికుడూ, సుకేశినీహెచ్చరిక చేశారు. కనుక నౌకను దీవికి ఎడంగా నడపండి."

అతని మాటలు విని అతని అనుచరులు నీరుకారిపోయారు. మాయావిమటుకు మండిపడిపోతూ, "రూపధరా, నువు మనిషివి కావు, రాయివి! నీకు విసుగూ విరామమూ అవసరంలేదు. ఇదుగో నీ మనుషులు, నిద్రాహారాలు లేక చావటానికి సిద్ధంగా వున్నారు; కాని వీరిని తీరానికి పోవద్దంటావు, వంట చేసుకుని కడుపునిండా తినవద్దంటావు! రాత్రి పడబోతున్నది. ఒక రాత్రివేళ ఏ ఉప్పెన వచ్చినా రావచ్చు. ఆ ఉప్పెనలో మనం నడిసముద్రంలో వుంటే ఏంకాను? నూరు అరయేదిగాక, ఈ రాత్రికి ఈ తీరాన విశ్రాంతి తీసుకుని వంటలు చేసుకోక తప్పదు. కావలిస్తే రేపు తెల్లవారగానే మళ్లీ బయలుదేరుదాం!" అన్నాడు.

ఈ మాటలకు మిగిలినవారంతా గట్టిగా హర్షించారు. విధివ్రాత తప్పించుకోవటం సాధ్యంకాదని రూపధరుడు గ్రహించాడు. అతను మాయావితో, "మీరంతా ఒకటైతే నేను చేయగలిగినదేమీ లేదు. కాని మీరంతా ఒక ప్రమాణం చెయ్యాలి: మనకు ఆవుల మంద తగిలినా, గొర్రెలమంద తగిలినా వాటి జోలికి పోగూడదు. మనలో ఏ ఒకరు కూడా ఒక్క ఆవునుగాని, ఒక్క గొర్రెను గాని చంపటానికి ప్రయత్నించకూడదు. మనకు సుకేశిని ఇచ్చిన ఆహారం మినహాగా ఇంకేమీ ముట్టవద్దు. ఆ ప్రకారం మీరంతా ప్రమాణాలు చేశారంటే ఈ త్రినాసియా దీవిమీద అడుగుపెట్టటానికి నేను అంగీకరిస్తాను!" అన్నాడు.

మిగిలినవారంతా ఆ ప్రకారమే ప్రమాణాలు చేశారు. —(ఇంకా వుంది)






## 4

[మొరాకో మాంత్రికుడు అలాదీన్‌ను భూగర్భంలో పెట్టి వెళ్ళిపోయాక అతను తన వేలి నున్న ఉంగరంలో ఉన్న భూతం సహాయంతో పైకి వచ్చి ఇల్లు చేరుకున్నాడు. తరవాత లాంతరులో ఉన్న భూతం అతనికి పెద్దపెద్ద వెండికంచాలలో మహారాజులు తినే భోజనం తెచ్చి పెట్టసాగింది. ఆ వెండి అమ్ముకుని అలాదీన్ ధనికుడు కాసాగాడు. గుహలో నుంచి తాను తెచ్చిన రత్నాలు అపారమైన విలువగలవనికూడా అతనికి అర్థమయింది. ఇంతలో ఒకనాడతను రాజకుమార్తె బుదూర్‌ను చూసి ఆమెను ప్రేమించాడు.]

అలాదీన్ ఇంటికి చేరేసరికి అతను ఈ ప్రపంచంలో ఉన్నట్టు లేడు. అతని వాలకం చూసి తల్లి అదుర్దాగా, "అలా వున్నావేంరా, నాయనా? ఒంట్లో బాగాలేదా?" అని అడిగింది.

అలాదీన్ తల్లికి జవాబు చెప్పలేదు. తల్లి తీసుకువచ్చి తన ఎదట పెట్టిన భోజనం అతను ముట్టనేలేదు.

"అయ్యో, తండ్రీ! నీకేం జబ్బు చేసిందిరా? బాధ ఏమైనా వుందా? నాతో మాటమాత్రం చెప్పరా!" అని తల్లి ఎంతగానో బతిమాలింది.

"నన్ను వేధించకమ్మా!" అన్నాడు అలాదీన్ విసుగుగా.

అతను అన్నం తిన్నదాకా తల్లి వదిలి పెట్టలేదు. అందుకని అతను కొంచెంగా

బి. ప్రసాదరావు



ఎంగిలిపడ్డాడు. ఆ తరవాత అతను పక్క మీద పడుకుని ఆ రాత్రల్లా ఏమేమిటో ఆలోచించాడు. మర్నాడల్లా అతను పక్కమీది నుంచి లేవలేదు.

కొడుకు ప్రవర్తన తల్లికి విచిత్రంగా కనిపించింది. ఆవిడ అతన్ని ప్రశ్నలతో వేధించింది, వైద్యుణ్ణి పిలుస్తానన్నది. కొత్తగా ఒక అరబ్బీ వైద్యుడు నగరానికి వచ్చాడు. రాజుగారుకూడా ఆయనచేత వైద్యం చేయించుకుంటున్నారు. కావలిస్తే ఆ వైద్యుణ్ణి పిలుచుకువస్తానన్నది ఆమె.

"అమ్మా, నేను బాగానే ఉన్నాను. నాకే రోగమూ లేదు. ఇదివరకల్లా ఆడవాళ్ళందరూ



నీలాగే ఉంటారనుకునే వాణ్ణి. కాని నిన్న రాజకుమార్తె బుదూర్‌ను స్నానశాలవద్ద చూశాను. స్నానశాలవద్ద ఆమె తన మొహం మీది మేలిముసుగు తొలగించింది; అప్పుడు నా కామె మొహం కనబడింది. వెంటనే నాకు నవనాడులు నీరసించినట్టయి పోయింది. ఎలాగైనా రాజుగారిని ఒప్పించి ఆమెను పెళ్ళాడితే తప్ప నా మనస్సుకు శాంతి ఉండదు!" అన్నాడు అలాదీన్.

ఈ మాటలు వినగానే అలాదీన్ తల్లి నిశ్చయంగా తన కొడుక్కు పిచ్చి పట్టిందనుకున్నది.

"అవేం మాటలురా? నీకేమైనా మతిపోయిందా ఏమిటి? ఇక ఎన్నడూ అలాటి మాట అనకు!" అని ఆమె తన కొడుకును మందలించింది.

"నాకేమీ పిచ్చిలేదు. నువు లక్ష చెప్పు గాక, నా మనసు మారటం కల్ల! నేను రాజకుమార్తెను పెళ్ళాడి తీరవలిసిందే. రాజుగారివద్దకు వెళ్ళి, మీ అమ్మాయిని నాకిచ్చి పెళ్ళి చేస్తారా, చెయ్యరా అని ఖచ్చితంగా అడిగేస్తాను. ఏమైనాసరే వెనకాడేది లేదు!" అన్నాడు అలాదీన్.

"మళ్ళీ అదే మాటా? చుట్టుపక్కల వాళ్ళు వినిపోగలరు, ఊరుకోరా, బాబూ!





రాజుగారిని ఇటువంటి మాట అడగటానికి మధ్యవర్తులైనా ఉండాలా? నీకెవరు మధ్యవర్తిత్వం చేస్తార్రా?" అన్నది తల్లి.

"నువ్వున్నావుగా, అమ్మా? నీకన్న నాకెవరున్నారూ? అందుచేత నువు వెళ్లి నా మనసులో ఉన్న కోరికను రాజుగారికి తెలియజెయ్యి!" అన్నాడు అలాదీన్.

"ఇంకా నయం! నేనా? నీతోపాటు నాకుకూడా మతిపోయిందనుకున్నావా ఏం? మీ నాన్నేమో కూటికి లేని దర్జీవాడు. రాజుగారి కూతుర్ని పెళ్లాడతాననటానికి నీకసలు హక్కెక్కడుంది? వారా అమ్మాయిని ఏ రాజాధిరాజు కొడుకుకో ఇచ్చి చేస్తారు. కయ్యానికీ వియ్యానికీ సమాన హోదా ఉండాలి, నాయనా!" అన్నది తల్లి.

"అదంతా నాకు తెలియదా, అమ్మా? ఏమైనా నేనీ పెళ్లి చేసుకోవటానికి పూర్తిగా నిశ్చయించుకున్నాను. ఈ నిశ్చయం మారబోదు. నేను కొడుకునన్న ఆపేక్ష నీకున్నట్టయితే నాకీ కాస్త సహాయమూ చెయ్యి. ఎందుకంటే ఈ కోరిక తీరని పక్షంలో నేను అట్టేకాలం బతకను. నీకా నేనొక్కణ్ణే కొడుకును!" అన్నాడు అలాదీన్.

అలాదీన్ తల్లి కంట తడి పెట్టుకుంటూ, "అవును, నాయనా! నేను నీ తల్లిని, నువొక్కడివే నా కొడుకువు. నీకు పెళ్లి అయి సుఖంగా ఉండటంకన్న నాకే కోరికా లేదు. అందుచేత మన సమానస్తుల పిల్ల ఎక్కడైనా ఉంటే పెళ్లిమాటలు జరుపుతాను. అప్పుడుకూడా పిల్లతరుపు వాళ్లు, నీ కొడుకేం చేస్తూంటాడని అడిగితే ఏం చెప్పాలో నాకు తెలీదు. మనబోటివాళ్లకే సమాధానం చెప్పలేని స్థితిలో ఉండి రాజుగారి కూతుర్ని ఎలా అడిగేది, నాయనా? కొంచెం ఆలోచించు, అలాటి కోరిక బయట పెట్టినాక మనల్ని బతకనిస్తారా? అసలు అడగటానికి నాకుమాత్రం ఎలా మొహం చెల్లుతుంది. మొదలు నేను రాజుగారి

ఎదటికి వెళ్లటం ఎట్లా? వెళ్లానే అనుకో ఆయన కేదైనా కానుక ఇవ్వాలిగద! ఏం ఇవ్వను? పోనీ మహారాజుగారికి నువ్వేదైనా మహోపకారం చేశావు గనకనా?" అన్నది.

"నువు చెప్పేది నిజమేనమ్మా. నేను మహారాజుకు ఏమి మహోపకారం చేశా నని అడుగుతున్నావు. నే నాయనకు అపూర్వమైన వస్తువు బహుమానం ఇవ్వ గలను. నేను గుహలో వున్న తోటనుంచి తెచ్చిన రాళ్ళు అమూల్యమైన రత్నాలు. అటువంటి రత్నాలలో ఒక్కటికూడా ఏ రాజువద్దా వుండదు. ఒక పళ్ళెం పట్టుకురా, వాటిని చూపిస్తాను!" అన్నాడు అలాదీన్.

అతని తల్లి ఒక పింగాణీ పళ్ళెం తెచ్చింది. అతను దానిలో కొన్ని రత్నాలు పేర్చాడు. వాటి కాంతి చూసి అతని తల్లి నిర్ఘాంతపోయింది. "వీటిని తీసుకుపోయి మహారాజుకు కానుకగా ఇచ్చి ఆయన దర్శనం చెయ్యి," అన్నాడు అలాదీన్.

"సరే, నాయనా! ఇది చాలా గొప్ప బహుమానమే. కాని ఆ మహారాజు ఏం కావాలంటే, నా నోటమాట వస్తుందో రాదో! మీ అమ్మాయిని మా అబ్బాయి కివ్వమంటే నన్ను తిట్టి గెంటేస్తారేమో! మనిద్దరికీ మరణదండన విధిస్తారేమో! అయినా నీ కోసం ఏం చెయ్యమన్నా చేస్తాను. కాని,



నీ హోదా ఏమిటీ, నీకున్న ఆస్తి ఏమిటంటే ఏమని చెప్పేదిరా ?" అన్నది తల్లి.

ఈ బహుమానం తీసుకున్నాక ఆయన అటువంటి ప్రశ్న వెయ్యడమ్మా! ఒకవేళ వేస్తే నీ యిష్టం వచ్చిన సమాధానం చెప్పు. అది నిజం చేసేటందుకు మనదగ్గిర అద్భుత దీపం వున్నది!" అన్నాడు అలాదీన్.

మర్నాడు అలాదీన్ తల్లి, అద్భుతదీపం మీద భారమంతా వేసి, ధైర్యంగా రాజుగారి దర్శనానికి సిద్ధమయింది. ఆవిడ పళ్ళెంలోని రత్నాలపైన ఒక శాలువా కప్పి, పెందలాడే రాజుగారి ఇంటికి వెళ్లింది. రాజదర్శనం కోసం వచ్చేవారింకా గుంపు కూడలేదు. మంత్రులూ, ఇతర అధికారులూ సభా భవనంలోకి పోవటం ఆమెకు కనిపించింది. చివరకు రాజుగారు వచ్చారు. సభలో అందరూ లేచి నిలబడ్డారు. రాజుగారు సింహాసనంపై కూర్చున్నాక సభికులు ఎవరి హోదాకు తగ్గ స్థానాలలో వారు కూర్చున్నారు.

ముందుగా న్యాయవిచారణలు జరిగాయి. కాని రాజుగారి దర్శనం కోసం వచ్చినవారిలో చాలామందిని వ్యవధి చాలక వెళ్లిపొమ్మన్నారు. అలాదీన్ తల్లికికూడా ఇదే గతి పట్టింది. అందరికన్న ముందే వచ్చినప్పటికీ, ఆమెకు రాజుగారి దర్శనం





చేయించటానికి ముందుకు వచ్చినవారు లేకపోయారు. ఆవిడ వచ్చిన దారినే ఇంటికి తిరిగి వచ్చింది.

ఆమె చేతిలో పళ్ళెం చూడగానే ఆమె వెళ్లిన పని కాలేదని అలాదీన్ గ్రహించాడు. ఆవిడ లోపలికి వచ్చి, "ఎలాగైతేనేం రాజ సభలో ఇవాళ అడుగుపెట్టాను, నాయనా! రాజుగారితో నేను మాట్లాడలేదు నిజమే, కాని ఇంకా చాలామంది నాలాగే మాట్లాడలేదు. దేవుడు అనుగ్రహిస్తే రేపు మాట్లాడతాను," అన్నదావిడ.

అలాదీన్‌కు మొదట నిరాశ కలిగినా తల్లి మాటలతో ధైర్యమూ, ఓర్పూ వచ్చాయి.



అలాదీన్ తల్లి మర్నాడు వెళ్లింది గాని సభాభవనం మూసివుంది. సభ రోజువిడిచి రోజు జరుగుతుందట. ఆవిడ సభకు వెళ్లటం మానలేదు. వారం రోజులు గడిచాక రాజుగారు ఆమెను గమనించి, తన మంత్రితో, "ఆ మనిషిని ప్రతిసారీ చూస్తున్నాను. శాలువ కప్పి ఏదో పట్టుకొచ్చి అలా నిలబడుతోంది. ఆమె పని ఏమిటో?" అన్నాడు.

"మహాప్రభూ, స్త్రీలది అల్పబుద్ధి. భర్త మీదనో, బంధువులమీదనో ఫిర్యాదు చేయటానికి వచ్చిఉంటుంది!" అన్నాడు మంత్రి.

"ఈసారి ఆమె వచ్చినప్పుడు నా ఎదటికి పంపించు," అన్నాడు రాజు.

మరునాడు రాజు ఆమెను తన ఎదటికి పిలిపించి, "ఏమమ్మా, నిన్ను చాలా రోజులుగా చూస్తున్నాను. నువు ఎన్నడూ నా ఎదటికి వచ్చి ఏమీ చెప్పుకోలేదు. నావల్ల నీకే సహాయం కావాలి?" అని అడిగాడు.

అలాదీన్ తల్లి రాజుగారికి వంగి నమస్కారాలు చేసి, "మహాప్రభూ, నా మాటలలో అపచారం ఏమన్నా ఉంటే దండించనని అభయం ఇవ్వండి!" అన్నది.

రాజుగారు నవ్వి, "నీకేమీ భయంలేదు. సభ ముగిసేదాకా అగు, తరవాత నీకోరిక వింటాను," అన్నాడు.







సభ ముగిసింది. రాజూ మంత్రీ తప్ప మిగిలిన సభికులందరూ వెళ్లిపోయారు. రాజుగారు అలాదీన్ తల్లితో, "నీ కోరిక ఏమిటి ?" అన్నాడు.

"మహారాజా, అలాదీన్ అని నాకొక కొడుకున్నాడు. వాడొకనాడు రాజకుమార్తెను స్నానశాల తలుపుల వెనకనుంచి చూశాడు. అదిమొదలు వాడా పిల్లను ప్రేమించాడు. ఆమెను పెళ్లాడకపోతే చచ్చిపోతానంటున్నాడు. ఇందులో తప్పుంటే మన్నించాలి!" అన్నది అలాదీన్ తల్లి.

రాజు నవ్వి, "ఆ శాలువకింద ఏమిటి ?" అన్నాడు. అలాదీన్ తల్లి శాలువ తీసి, పళ్ళెంలో వున్న రత్నాలను రాజు గారి కి అందించింది. వాటిని చూసి రాజుగారికి నోట మాట రాలేదు.

చివరకాయన, "నా జన్మలో నేనెన్నడూ ఇలాటి రత్నాలు చూసివుండలేదు. మంత్రీ, నువ్వెప్పుడైనా చూశావా ?" అన్నాడు.

"లేదు, మహాప్రభూ !" అన్నాడు మంత్రి.

"ఇలాటి రత్నాలు పంపినవాడు నా కుమార్తెను పెళ్ళాడటానికి అర్హుడు కాడూ?" అన్నాడు రాజు.

ఈ మాటకు ఏం జవాబు చెప్పాలో తెలియక మంత్రి తికమకపడ్డాడు. రాజకుమార్తె బుదూర్‌ను తన కొడుకుకిచ్చి చేస్తానని రాజుగారు లోగడ అనివున్నాడు.

"మహారాజా, తమరు ఇంతకు పూర్వం రాజకుమార్తెను నా కొడుకుకిచ్చి పెళ్ళి చేస్తానని వాగ్దానం చేసివున్నారు. తమరు మా అబ్బాయికి మూడునెలలు గడువిచ్చే పక్షంలో వాడు ఇంతకంటె విలవైన కట్నం తెస్తాడు !" అన్నాడు మంత్రి.

మూడునెలలు కాదు, ముప్ఫై ఏళ్ళు గడువిచ్చినా ఇంతకంటె విలవగల కట్నం తీసుకురావటం మంత్రి కొడుకువల్ల కాదని రాజుకు పూర్తిగా తెలిసికూడా, మంత్రి కోరికను మన్నించి సరేనన్నాడు.





తరవాత రాజుగారు అలాదీన్ తల్లికేసి తిరిగి, "నా కుమార్తెను ఇచ్చి పెళ్ళి చేస్తానని మీ అబ్బాయితో చెప్పు. కాని మూడునెలల దాకా పెళ్లి జరగదని చెప్పు. ఎందుకంటే పెళ్ళి ప్రయత్నాలకు ఆ మాత్రం వ్యవధి కావాలి," అన్నాడు.

అలాదీన్ తల్లి రాజుగారిని దీవించి శలవు పుచ్చుకుని ఇంటికి వచ్చేసింది. ఆమె మొహాన చిరునవ్వు చూడగానే అలాదీన్‌కు ఆశ రేకెత్తింది.

"నాయనా, రాజుగారు నీకు పిల్లనివ్వటానికి ఒప్పుకున్నాడు. అయితే మంత్రిగారు ఆయన చెవిలో ఏదో గొణిగాడు. దానిమీదట రాజుగారు మూడునెలలదాకా పెళ్ళి వాయిదా కావాలన్నాడు. మంత్రి ఏదో కుట్ర చేసి పెళ్ళి పడగొడతాడని నాకు అనుమానంగా ఉందిరా!" అన్నది.

అలాదీన్ పరమానంద భరితుడైనాడు. మూడునెలల వ్యవధి అతనిని అంతగా బాధించలేదు. "చచ్చిపోతున్నవాడికి ప్రాణం పోశావమ్మా!" అంటూ అతను తన తల్లిని అభినందించాడు.

రోజులు లెక్కపెడుతూ అలాదీన్ రెండు నెలలు గడిపాడు. ఆ తరవాత ఒకరోజు సాయంకాలం అతని తల్లి నూనెకోసం బజారుకు వెళ్ళింది. ఆవిడకు వీధులు చూడగానే ఆశ్చర్యం కలిగింది. దుకాణాలన్నీ మూసేశారు. వీధులనిండా తోరణాలూ, అలంకారాలూ, దీపాలూ కనిపించాయి. "ఈ ఆర్భాటమంతా ఏమిటి?" అని ఆవిడ నూనెకొట్టువాణ్ణి అడిగింది.

"నీకింకా తెలీదా? ఈ రాత్రికి మంత్రి కుమారుడు రాజకుమార్తెను పెళ్ళాడుతున్నాడు." అన్నాడు నూనె అమ్మేవాడు.

ఈ మాట వినగానే అలాదీన్ తల్లికి మతి పోయినట్టయింది. ఈ దుర్వార్త తన కొడుకు చెవిని వేయుట మెలాగా అనుకుంటూ ఆవిడ ఇంటికి తిరిగి వచ్చింది. —(ఇంకావుంది)





# గోదురుకప్ప గొడవ

ఎలుగుబంటికి గోదురుకప్పమీద చాలా కోపం వచ్చింది. తాను కుందేలును పట్టుకోవటానికి పోతున్నప్పుడు తనకు తప్పుదారి చూపించి మోసగించినది గోదురుకప్పేనని ఎలుగుబంటి అనుకుని, దానిమీద పగ తీర్చుకోవటానికి నిశ్చయించింది.

ఈ అవకాశం త్వరలోనే లభించింది. వారంరోజులు తిరగకముందే ఎలుగుబంటికి గోదురుకప్ప మడుగు ఒడ్డున నిద్రపోతూ కనిపించింది.

ఎలుగుబంటి తన చేతిలోవున్న గొడ్డలి కింద పెట్టి, వెనకగా వెళ్ళి గోదురుకప్పను తన పంజాలో పట్టి పైకెత్తింది.

గోదురుకప్ప కంగారుగా నిద్ర లేచి సూటిగా ఎలుగుబంటి కళ్ళలోకి చూసి ఆశ్చర్యపడింది.

"బాగున్నావా, గోదురుకప్పా? పిల్లా జెల్లా అంతా క్షేమమేనా? పాపం, ఇక నీకు వాళ్ళను చూసే గీత లేదు!" అన్నది ఎలుగుబంటి.

ఎలుగుబంటికి తనమీద ఎందుకో కోపం వచ్చినట్టు గోదురుకప్ప వెంటనే గ్రహించి, "అకారణంగా అట్లా అంటావేం, మామా?" అన్నది కొంచెంగా భయపడుతూ.

"నన్నుచూసి వేళాకోళం చేసినప్పుడు కాస్త ముందాలోచన వుంటే సరిపోయేదిగా? ఇప్పుడు అమాయకపు మొహం వేస్తావేం?" అన్నది ఎలుగుబంటి.

గోదురుకప్పకు ఎలుగుబంటి మాటలు గాని, ధోరణిగాని కొంచెంకూడా అర్థం కాలేదు. "నేను నీకు ఏం అపకారం చేశాను?" అన్నది.

"కుందేలు అటుగా వెళ్ళిందని చెప్పింది నువు కాదూ? నీకు నాతో పరాచకాలా? నాకు దొరకకుండా తప్పించుకుపోదామనుకున్నావు గామాలు. అది సాధ్య

టి. శంభుదాసు

మవుతుందనేనా? నా సంగతి నీకు తెలీదు!" అన్నది ఎలుగుబంటి.

ఎలుగుబంటి మాటలు ఇప్పటికీ గోదురు కప్పకు అర్థంకాలేదు. కాని ఎలుగుబంటి తన ప్రాణం తీసేస్తుందన్నది స్పష్టమయింది. అందుచేత గోదురుకప్ప తానుచెయ్యని తప్పు ఒప్పుకుంటూ, "ఈసారి మన్నించు, మామా! అటువంటి తప్పు ఇంకెన్నడూ చెయ్యను, నామాట నమ్ము మామా!" అని బతిమాలసాగింది.

ఎలుగుబంటి కోపంతో పళ్ళు కొరికింది.

"నన్నీసారికి వదిలేశావంటే నీకు కడవంత తేనెతుట్టె చూపిస్తాను, మామా!" అన్నది గోదురుకప్ప.

ఎలుగుబంటికి జాలి కలగలేదు; గోదురు కప్పను ఎట్లా చంపటమా అని ఆలోచించసాగింది. అది నీళ్లలో చావదు. నిప్పులో వేస్తే చస్తుంది గాని, ఎలుగుబంటిదగ్గిర సమయానికి నిప్పులేదు.

ఎలుగుబంటి ఆలోచన గోదురుకప్పకు అర్థమయింది. అది ఏడవటం మాని, "మామా, నన్ను ఎలాగూ చంపదలిచావు గనక, నేను కోరిన విధంగా చంపు. అదుగో ఆ కనబడే చాకిబండమీద నన్ను పెట్టి, నీ గొడ్డలితో నన్ను తెగవెయ్యి. మడుగులో వున్న నా వాళ్ళను చూస్తూ ప్రాణం విడుస్తాను!" అన్నది.

ఎలుగుబంటి కిది మంచి ఆలోచనగానే కనబడింది. అది గోదురుకప్పను చాకిబండ మీద పెట్టింది. గోదురుకప్ప తనవారికోసం వెతుకుతున్నదానిలాగా అటూఇటూ కలయజూడసాగింది. అప్పుడు ఎలుగుబంటి కోపంగా తన గొడ్డలి రెండుచేతులా పట్టి ఎత్తి బలంగా కొట్టింది.

గొడ్డలి మీద పడేలోపల గోదురుకప్ప నీటి మడుగు మధ్యకు ఒక్క దూకు దూకింది. రాతికి తగిలి ఎలుగుబంటి గొడ్డలి కాస్తా మొక్కపోయింది.



# పెంగ్విన్ పక్షులు

పక్షులన్నిటినీ శాస్త్రజ్ఞులు నాలుగు ముఖ్యజాతులుగా విభజించారు. ఆ నాలుగింటిలో ఒకటి పెంగ్విన్‌పక్షి. 1520 లో మానవుడు మొదటిసారిగా పెంగ్విన్ పక్షులను చూశాడు. ఈ పక్షులలో 17 రకాలున్నాయి; ఇవి అన్నీ దక్షిణార్ధగోళంలోనే ఉన్నాయి—అంటే భూమధ్య రేఖకు ఉత్తరాన ఇవి నివసించవు. అనేక లక్షల ఏళ్ల క్రితం—హిమాలయపర్వతాలు భూగర్భంలోనుంచి పైకి తోసుకువస్తున్న కాలంలో—పెద్దపెద్ద పెంగ్విన్‌పక్షులు భూమిమీద అనేక ప్రాంతాల సంచరించాయనటానికి ఆధారాలున్నాయి. వాటి శిధిలాలు న్యూజీలాండ్, అర్జెంటీనా, ఆస్ట్రేలియా మొదలైన ప్రాంతాల దొరికాయి. ఆ పక్షులు అయిదేసి అడుగుల ఎత్తుండి, దాదాపు 200 పౌనుల బరువుండేవి. సాధారణంగా ఈ పక్షులు దక్షిణ ధృవమండలంలో ఉంటాయని అందరూ అభిప్రాయపడతారు. కాని ఇది నిజంకాదు. 4 రకాల పెంగ్విన్‌లు మాత్రమే ఆ మండలంలో నివసిస్తాయి. దక్షిణ అమెరికా, దక్షిణాఫ్రికా, న్యూజీలాండ్, పెసిఫిక్‌దీవులు—ఈ చోట్ల పెంగ్విన్‌పక్షులు నివసిస్తున్నాయి.

అన్నిరకాల పెంగ్విన్‌లలోకీ "చక్రవర్తి" పెంగ్విన్‌లు చాలా పెద్దవి. ఇవి నాలుగడుగుల ఎత్తుండి, నూరు పౌనుల లోపు బరువుంటాయి. అయితే 15, 16 అంగుళాలు



"చక్రవర్తులు"

మించని ప్రమాణం గల పెంగ్విన్ రకాలుకూడా ఉన్నాయి. సైజులో తప్ప మిగిలిన అన్ని విషయాలలోనూ అన్నిరకాల పెంగ్విన్ పక్షులూ ఒకటిగానే ఉంటాయి.

పెంగ్విన్ పక్షులు ఎగరలేవు. వాటి రెక్కలు చాలా చిన్నవి. కాని అవి ఈదగలవు. అవి నీటిలో మునిగి ఒక సెకండుకాలంలో 30 అడుగులదూరం—గంటకు 20 మైళ్లు మించిన వేగంతో—ఈదుతాయి.

ఈ పక్షులు ఉష్ణరక్తప్రాణులు. వాటి శరీరాల వేడి 100 డిగ్రీలు దాటుతుంది. అయినప్పటికీ అవి ప్రపంచంలోకల్లా శీతలప్రాంతంలో నివసిస్తాయి. అందుచేత వాటి శరీరాల వేడిని కాపాడటానికి కొవ్వు సహాయపడుతుంది. "చక్రవర్తి" పెంగ్విన్ శరీరంలో అంగుళం మందాన కొవ్వు ఉంటుంది. పెంగ్విన్‌పక్షుల రెక్కలు నిజమైన రెక్కలు కావు, ఈదటానికి పనికివచ్చే తెడ్లుమాత్రమే. కాని ఈ పక్షులుకూడా, కోళ్లూ, పిచ్చుకలూ, బాతులూ నిద్రపోయినట్టుగా, తమ ముక్కులను రెక్కలలో దూర్చుకుని నిద్రపోతాయి.

మంచుమీద వేగంగా పోవలిసివచ్చినప్పుడు పెంగ్విన్‌లు తమ పొట్టలమీద పడుకుని రెక్కల సహాయంతో శరీరాలను ముందుకు తోసుకుంటూ వేగంగా పోతాయి.

పెంగ్విన్‌లు నీటి అడుగుకు వెళ్లి అక్కడ తమ ఆహారాన్ని వెతుక్కుంటాయి. అవి నీటిలో నుంచి అతి వేగంగా గాలిలోకి ఎగిరి, అదే ఊపున ఒడ్డున వచ్చి వాలగలవు. ఈ సందర్భంలో అవి ఒక చిత్రం ప్రదర్శిస్తాయి. నీటిలో ప్రవేశించే ముందు పెంగ్విన్‌పక్షి గులకరాళ్లను ఏరి మింగుతుంది. మళ్లా నీటినుంచి బయటికి రాగానే ఆ రాళ్లను కక్కేస్తుంది. బహుశా ఈ రాళ్లు వాటి శరీరాలను బరువెక్కించి, నీటి అడుగుకు మునగటానికి తోడ్పడతాయేమో. నీటిలో ఉండే జలచరాలే పెంగ్విన్‌లకు ఆహారం. ఆ జలచరాలు ఒక ప్రాంతంనుంచి ఇంకొక ప్రాంతానికి వెళ్లినప్పుడు, వాటితోబాటు పెంగ్విన్‌లు కూడా వెళతాయి.



"సలాం! సలాం!"

ఈ పక్షులు సంఘజీవులు, అనేకమైన కట్టుబాట్లు పాటిస్తాయి.

అడపెంగ్విన్‌పక్షి తడవకు ఒక గుడ్డుమాత్రమే పెడుతుంది. కాని దాన్ని పొదగటం మగపక్షి వంతు. అడపక్షి గుడ్డుపెట్టి మగపక్షికి వప్పగించి ఆహారంకోసరం వెళ్లిపోతుంది. అప్పుడు మగపక్షి ఒకచోట నిలబడి, గుడ్డును తన కాళ్లమీద ఉంచుకుని పొదగటం ప్రారంభిస్తుంది. ఆడపక్షి రెండు మాసాలకుగాని తిరిగిరాదు. అంతదాకా మగపక్షి ఆహారం తినదు. గుడ్డును ఆడపక్షికి వప్పగించి మగపక్షి ఆహారంకోసం వెళుతుంది.

నూటికి 75 పెంగ్విన్‌పిల్లలు అకాలమరణం వాత పడతాయి. అందుచేత పెంగ్విన్ సమాజంలో పిల్లలు తక్కువ. అందుచేత పిల్లపెంగ్విన్‌లపై పెద్దపక్షులకు ప్రేమ జాస్తి. ఆ పిల్లలను ముద్దుచెయ్యటంకోసం పెద్దపక్షులు తరుచు కొట్టుకుంటాయి. ఈ కొట్లాటలో పిల్లలు నలిగి చావటంకూడా జరుగుతుంది.

పెంగ్విన్‌పక్షులు అస్తమానం వాగుతాయి. "పక్షి వాగినట్టు వాగటం" అనేది పెంగ్విన్‌ల పట్ల అక్షరాలా నిజం. పెంగ్విన్‌పక్షుల మందలు చేసే రణగొణధ్వని గాలివాలున 30 మైళ్ల దూరానికికూడా వినిపించటం కద్దు. ఈ చప్పుడు అహోరాత్రాలు ఎడతెరిపి లేకుండా సాగుతుంది.

పాత ఈకలు పోయి కొత్తవి వచ్చేటప్పుడు పెంగ్విన్‌పక్షి ఒక నెల రోజులపాటు నిశ్చలంగా ఒకచోట నిలబడి ఉంటుంది; అంతకాలమూ అది తిండి తినదు, స్నానం చెయ్యదు. ఈ పక్షులు తెలివైనవికావు. వాటికి దూరపుచూపు అసదు. ఒక పెంగ్విన్‌పక్షి పొదగటానికి గుడ్డు లేకపోగా ఒక డబ్బాను సంపాదించి దాన్ని పొదిగిందట! కాని ఈ పక్షులు చాలా బలమైనవి. ఒక "చక్రవర్తి" పక్షి అయిదుగురు మనుషులను



మంచుమీద దేకుతున్న పెంగ్విన్‌లు

విదిలించేసిందట! వాటి సహజవాతావరణంలో పెంగ్విన్‌పక్షులు సుమారు 35 ఏళ్లు బతుకుతాయి. కాని వాటిని నిర్బంధంలో ఉంచితే అటేకాలం బతకవు.

పెంగ్విన్ పక్షులకు ముక్కోపం జాస్తి, మిగతా సమయాలలో అవి చాలా "పెద్దమనిషి తరహాగా" ఉంటాయి. రెండుపక్షుల ముఠాలు ఒకదానికొకటి ఎదురైనప్పుడు, ఒకదానికొకటి తలలు వంచుతాయి; తరవాత సంభాషించుకుంటాయి. "మాట్లాడటం" అయిపోయాక, 'వెళ్లివస్తా'మని చెప్పటానికి ముక్కులు పైకెత్తి గాలిలో గుండ్రగా సున్నాలు చుట్టుతాయి.

దక్షిణ ధృవమండలంలో తిమింగిలాలను వేటాడటానికి కొందరు వెళ్లారు. వారున్న చోటికి ఒక "చక్రవర్తి" పెంగ్విన్‌ల ముఠా బారుతీరి నడుస్తూ వచ్చి, అంతదూరంలో ఆగింది. తరవాత వాటిలో ఒకటి కొంచెం ముందుకువచ్చి, తలవంచి ఎత్తి, అయిదు నిమిషాలపాటు "ప్రసంగం" చేసి, అర్థమయిందా అన్నట్టుగా వేటగాళ్ల నాయకుడి మొహంలోకి చూసింది!

ఇంకొకసారి ఒక చచ్చిన తిమింగిలంపైన రెండు పెంగ్విన్‌పక్షులున్నాయి. అందులో ఒకటి పొరబాటున రెండోదాని కాలు తొక్కింది. అప్పుడు రెండోది మొదటిదాన్ని "తిట్టటం" మొదలుపెట్టింది. మొదటిది ఈ తిట్లను కాస్సేపు భరించి తానుకూడా "తిట్టటం" ఆరంభించింది. ఇలా పదిహేను నిమిషాలపాటు రెండూ ఛడామడా తిట్టుకుని, విసిగి, తిమింగిలం చెరొక చివరకూ వెళ్లిపోయి, వెంటనే నిద్రపోయాయి!

ఈ పక్షిని గురించి ఇలాటి చిత్రమైన విషయాలెన్నో చెబుతారు.



నీటి అడుగునుంచి పైకిలేచే పెంగ్విన్

## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1958 ఫిబ్రవరి సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ డిసెంబర్ నెల 10-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:— చందమామ ఫోటో. వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

## డిసెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఉ-కు దీర్ఘమిస్తే ఊ....యు, ల.

రెండవ ఫోటో : ఊ యు ల.

పంపినవారు :

వై. వి. ఎల్. నరసింహారావు, S.S.L.C., కూచినపూడి పోస్టు, రేపల్లె తాలూకా, (గుంటూరు జిల్లా.)

బహుమతిమొత్తం రు. 10/— ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

# చిత్రకథ





ఒకరోజున దాసూ, వాసూలు 'టైగర్' ను వెంటబెట్టుకుని, ఒక కొబ్బరితోటకేసి షికారు బయలుదేరారు. వాళ్లు తోటను సమీపించేసరికి తోటకాపలావాడు కేకలు పెడుతూ, కాయలు దొంగిలించుకు పోతున్నవాడి వెంట పరిగెత్తుతున్నాడు. దొంగ ఒక పొదచాటున మాయమయాడు. దాసూ, వాసూలు అక్కడికి వెళ్లేసరికి, పొదలోంచి పెద్ద కొమ్ములు బయటికి తొంగిచూసినై. ఈలోపల 'టైగర్' వెనకనుంచి వెళ్లి, ఆ కొమ్ములు గలవాడిమీద దూకింది. వాడు తారుకుని పొదలోంచి బయటపడ్డాడు. అందరూ కలిసి వాణ్ణి పట్టుకున్నారు.





Printed by B. NAGI REDDI at the B. N. K. Press (Private) Ltd., and Published by him for Chandamama Publications, from Madras 26.—Controlling Editor: SRI 'CHAKRAPANI'

# బిన్నీవారి క్రౌట్స్‌వాల్



"అత్యద్భుతమైన కాట్స్‌వాల్ ఉడుపులు ధరిస్తే
పిల్లల్లారా మీరెంత బాగున్నారో!
దాని రంగులు, ప్రింట్‌లు
అంత అందమైనవన్నమాట!"





కాట్స్‌వాల సాటిలేని విలువకలది;
కారణం...అతి జాగ్రత్తగా, శాస్త్రీయమైన పద్ధతులలో శ్రేష్ఠమైన ఉన్ని, నూలు కలిపి అది తయారు చేయబడింది.

ఎంత తేపర్యాగా వాడినా తుదివరకు మెత్తగా, మృదువుగా వుంటుంది. ప్రత్యేకించి పాపలకు, పిల్లలకు తగినది. వారి మృదువైన చర్మానికి ఎంతమాత్రం హాని చేకూర్చదు

కాట్స్‌వాల్ కుంగదని హామీ యిస్తున్నాము. ఇంటిలోనే కాట్స్‌వాల్ వస్త్రాలు ఉతుక్కోవచ్చు.

అనేక రంగులలో, ప్రింట్‌లలో, గళ్లలో, పైజమా గీరలలో దొరుకుతుంది.

కాట్స్‌వాల్‌కి ప్రత్యామ్నాయమైంది లేదు; అధిక వెచ్చదనానికి-బిన్నీవారి అంగోలా ధరించండి!

ఉన్ని, నూలు కలిపిన మేలిరకం, దట్టంగా వుంటుంది ధరించడానికి బహు మంచిది. అనేక రంగులనుంచి ఎన్నుకోండి!

**ఉచితం** బిన్నీవారి కాట్స్‌వాల్ రకముల నమూనాపొమ్మల పుస్తకం ఉచితం. డిపార్టుమెంట్ XXXX పోస్టుబ్యాగ్ 2701, మద్రాసు-6కు వ్రాస్తే మీకు కాపీ వస్తుంది.




ది బెంగుళూర్ వులెన్, కాటన్ & సిల్క్ మిల్స్ కంపెనీ, లిడ్.

మేనేజింగ్ ఏజెంట్లు: బిన్నీ & కం. (మద్రాసు) లిమిటెడ్.

BY 102 (a)

చూడండి! సన్‌లైట్ సగంబిళ్ల
మాత్రమే ఈ బట్టలన్నిటిని
ఉతికింది!



అట్లు చేసినట్టిది దాని
అధికమైన నురగ!




సన్ లైట్ సబ్బు బట్టలను
తెల్లగాను, కాంతివంతముగాను
ఉతుకును

S. 245-50 TL

హిందూస్థాన్ లీవర్ లిమిటెడ్ బొంబాయి వారి ఒక తయారు.




చదవడం వల్ల
శక్తి క్షీణిస్తుంది...

పుష్టికరమైన ఆహారం పోయిన శక్తిని చేకూరుస్తుంది. తుషార్‌తో వండిన మామూలు వంటలు కూడా పుష్టిని చేకూర్చడంలో సాటిలేనివి.






# తుషార్
విటమిన్‌లుగల వనస్పతి

TI-1/56 తుంగభద్ర ఇండస్ట్రీస్ లిమిటెడ్. కర్నూలు

# చందమామ

## ఇప్పుడు 6 భాషలలో వెలువడుతున్నది:

హిందీ - మహారాష్ట్రీ - గుజరాతీ

తెలుగు - కన్నడము - తమిళము

★

చందమామ నెలనెలా

**2,15,000** గృహాలను అలంకరిస్తుంది

★

మీ వ్యాపార సందేశాన్ని అందించటానికి

ఇది శక్తివంతమైన ప్రచార సాధనం

వివరములకు:

చందమామ పబ్లికేషన్స్

వడపళని :: మదరాసు-26.

ఏ విధమయిన అచ్చుపనులైనను

అతి చక్కగా...

అనుకొన్న గడువులో

మేము చేసి యివ్వగలము!

★

మా ముద్రణశాఖకు తోడుగా చిత్రకళాశాఖ, బ్లాకు తయారీశాఖ, లితో-అఫ్‌సెట్ సంస్థలు సమకూడి వున్నవి.

★

## ది బి. ఎన్. కె. ప్రెస్

(ప్రైవేట్) లిమిటెడ్

చందమామ బిల్డింగ్స్

వడపళని :: మదరాసు - 26

ఫోన్: 88851—3 లైన్లు



ఫోటో: గెవాపాన్ 33 పై
ఎ. ఎల్. సైయద్ తీసినది.

## ప్రయాణించే వేదాంతి

తన సామగ్రిపైన ఎంత లాభం తీయగలనా అనే ఆశతో ఈ బాటసారి బ్రహ్మాండమైన హిమాలయాలకు అడ్డుపడి ఉత్సాహంగా నడుస్తున్నాడు. ఇది ఒక నిశ్చింతుడైన సుఖజీవి కథ. గెవార్ట్ ఫిలిమ్‌తో తీసే బొమ్మలు ఇంకా ఎంత ఆనందమిస్తవో! అద్భుత మధురస్మృతులను అవి తలపునకు తెస్తవి. ఇన్‌డోర్ ఔట్‌డోర్ స్నాప్‌లకు ఎన్నికైనది గెవాపాన్ 33 లేక 36—"తప్పు వెలుగును సరిదిద్దగల" ఫిలిము. కలర్ ప్రింట్స్‌కు, ఎన్లార్జిమెంట్సుకు గెవాకలర్ నెగిటివ్ ఫిలిమ్ (ఎన్ 5) పూర్తితృప్తికి—నలుపు - తెలుపు, వర్ణచిత్రాల ప్రింట్స్‌కు, ఎన్లార్జిమెంట్సుకు—గెవార్ట్ పేపరునే వాడండి.







GEVAERT

ALLIED PHOTOGRAPHICS PRIVATE LIMITED

ఎల్లయిడ్ ఫొటోగ్రాఫిక్స్ ప్రైవేట్ లిమిటెడ్ : జంషెడ్జీ తాతా రోడ్డు : బొంబాయి - 1.

విజయా వారి

రాబోవు హాస్యరస చిత్రము..

# అప్పు చేసి పప్పు కూడు

యన్.టి.రామారావు...సావిత్రి...జమున

యస్.వి.రంగారావు...రేలంగి

డైరెక్షన్... ప్రసాద్




నిర్మాతలు... నాగిరెడ్డి & చక్రపాణి ...

Photo by Madangopal



బహుమతి
పొందిన వ్యాఖ్య

ఊయల

పంపినవారు :
వై. వి. ఎల్. ఎన్. రావు - కూచినపూడి

